పేటన్నిటిమాట అటుంచి, మరో ప్రక్కన కటికి వద్దర బోనులో మూడు కోతుల్ని పెట్టాడు. అవి తమ అవక తవక చేష్టలతో ప్రజలను సంతోష పెడుతున్నాయి. పథకం పలించింది. ఆ కొట్టు ముందర నిత్యం జనం గుంపులు గుంపులుగా చేరుతున్నారు. ముఖ్యంగా స్త్రీలు- సంతోషంతో కేకలు పెడుతున్నారు. పూర్వం తమ పురుషులు యే విధంగా తోక లాడించుకుంటూ నగ్నంగా విహరించే వారో యీ కోతులు ప్రదర్శిస్తుంటే చూడటం స్త్రీలకు ముచ్చటగా ఉందేమో.

ఈ దృశ్యాన్ని నోరుతెరుచుకుని తేరిపార చూసేలోకం మనుషులు గుమి గూడినప్పుడు అవకాశం చూసుకుని, నా కాకీచొక్కా భాయి ఆ గుంపు లోకి చొచ్చుకుని ప్రవేశిస్తున్నాడు. ఇంతకుముందెంతో మంది, జేబుదొంగల్ని గురించి వ్రాసే వుంటారని నాకు తెలుసుగాని, జేబుదొంగ తనంలోని నేర్పును వివరంగా వర్ణించటం యెంతైనా అవసరం. నాకు తెలిసినంత వరకూ, చిరుచేపల ఉత్పత్తికి మెరక ప్రదేశం యెంత అవసరమో నేర్పరి అయిన జేబుదొంగికికూడా జన సమూహాలంత అవసరం. జనసమ్మర్దంలో ఉన్నప్పుడే, యే మనిషికైనా తన పర్సుని కాని, గడియారాన్నికాని కా జేస్తున్న హస్తాన్ని గుర్తించటం అసాధ్యమవుతుంది. అంతే కాకుండా, జేబుదొంగ తనకు కావలిసిన వ్యక్తి దృష్టిని మరోవైపుకి త్రిప్పి, ఆదమరుపుగా ఉండేట్లు చేస్తే గాని, వేసుకున్న పథకం ఫలించదు. లేకుంటే యీ దోపిడీ ప్రపంచంలో ప్రతి మనిషీ తనవస్తువులను అత్యంత శ్రద్ధతో జాగ్రత్తగా చూసుకుంటూ వుంటాడు. ఏ వీధిలోనైనా అగ్నిప్రమాదం సంభవించినప్పుడు జేబుదొంగల పంట పండుతుంది. ఇప్పుడీ అగ్ని స్థానాన్ని కోతులు ఆక్రమించాయి. నవ్వు పుట్టించే వాటి చిలిపి చేష్టలూ, అర్థంబర్థం లేని వికారచేష్టలూ, నా కొత్త నేస్తం- జేబుదొంగకి అప్రయత్నంగా, దైవికంగా తోడ్పడ్డాయి.

క్షమించాలి, యీ పరిశోధనలో పరవశత్వంపొంది, ఉత్సాహాన్ని అణచుకోలేక పోతున్నాను. జేబుదొంగ సందర్శనం ప్రప్రథమంగా లభ్య మైందినాకు. పరిస్థితులుకూడా అపూర్వంగాను, ఉత్సాహ జనకంగానూ ఉన్నాయి.... కాదు..కాదు.. సరిగ్గా చెప్పాలంటే, యిది నా ద్వితీయానుభవం. నేను చదువుకుంటున్న రోజుల్లో తర్క శాస్త్రం నేర్చుకుంటూ, న్యాయస్థానానికి అప్పుడప్పుడు వెడుతుండేవాణ్ని. ఓ సారి అక్కడ, దొంగ లంగరేసిన

జుట్టుతో ఉన్న మొటిపులుసుఖం వాణ్నికణ్ని పోలీసువాళ్లిప్పుడు తీసుకొచ్చి బోనులో నెక్కించారు. బల్లమీద ఒక పర్సు ఉంది. సాక్ష్యానికొచ్చినవాళ్లు ఒట్టేసి చెప్పారు వాడు జేబుదొంగతనం చేశాడని. న్యాయాధికారి యేవో రెండు ముక్కలు చెప్పాడు. వెంటనే ఆ రాగిజుట్టు మనిషిని తీసుకుపోయారు. ఆరునెల్ల కారాగారావాసం విధించారతనికి. జేబుదొంగని చూడటం అదే మొదలు. అయితే, యిప్పటి పరిస్థితికీ దానికీ చాలా విభేదం ఉన్నది. ఇంతకుముందు నేను అసలైన జేబుదొంగని చూళ్లేదు. ఓ మనిషిని బోనులో నెక్కించి, యితరులు సాక్షులిచ్చిన హామిపైన వాణ్ని జేబుదొంగగా నిర్ణయించినప్పుడు చూశానంతే— కాని, ఆ దుష్కృత్యాన్ని చూడనేలేదు. ఒక మనిషి పైన నింద మోపబడినప్పుడూ, శిక్ష విధింపబడినప్పుడూ చూశానుగాని, ఆదొంగ తన విద్యను వాస్తవంగా ప్రయోగించినప్పుడు పరికించలేదు. అంచేత నేను దొంగనెప్పుడూ చూడలేదన్నమాట. దొంగ అన్నవాడు యెప్పటికైనా దొంగతనం చేస్తున్నప్పుడే దొంగవుతాడు కాని, ఆ తరవాత యెప్పుడో తను చేసిన నేరానికి సమాధానం చెప్పుకోవలసి వచ్చినప్పుడు కాదు. ఓ కవి అయినా అంతే— కావ్య నిర్మాణం చేస్తున్నప్పుడే కవి అవుతాడు కాని, అతర్వాత కొన్నేళ్లకి సభాసదుల సమక్షంలో కావ్యగానం చేసినంత మాత్రాన కవికాడు. ఒక కళాకారుడైనా అంతే. తన కళను సాధకం చేస్తున్నప్పుడే కళాకారుడవుతాడు. ఏ మనిషి అయినా, కృషి చేస్తున్నప్పుడే కృషికుడవుతాడు. బహుశా నా కిప్పుడా విచిత్రక్షణం యొక్క కటాక్షం లభిస్తుందేమో. ఒక జేబుదొంగ పనిచేస్తూంటే నేనిప్పుడు చూడాలి. అతని వ్యక్తిత్వాన్ని వాస్తవంగా చూడాలి. దొంగిలిస్తున్న సమయంలో అతని నిజస్వరూపాన్ని గమనించాలి. అట్టి అపూర్వ అవకాశాలు అందరికీ లభ్యం కావు. మానవ జనసంపంటి మాహత్తర సన్నివేశాలు ప్రజలకంట బడవు. ఆ అవకాశం నన్ను పులకింప జేసింది.

నాకు లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవటానికే నిశ్చయించుకున్నానని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. ప్రారంభదశలోని అతిస్వల్ప విషయాలను కూడా నేను నిర్లక్ష్యం చెయ్యకూడదు. ఆ అపూర్వ క్షణాన్ని అంతకన్న వొదులుకో కూడదు. ఈ హస్తలాఘవంలోని వైచిత్ర్యాన్నంతా విస్పష్టం చెయ్యాలని నిశ్చయించుకున్నాను. హోటలులో

నేను కూర్చున్నస్థలం పర్యవేక్షణ కనువుగా లేదు. అచోటు వొదిలేశాను. మరోచోట, యే అడ్డాలేనిచోట ఉండి, నేను కొత్తగా కనిపెట్టిన కళాకారుని చర్యలన్నిటినీ దీక్షగా పరిశీలించాలని హోటలుబయటికి వచ్చేసి రోడ్డుపక్కగా నిలబడ్డాను. అక్కడ గోడమీద ఉన్న సినిమాపేర్లూ, బొమ్మలూ అవీ చూస్తున్నట్లు నటిస్తూ. నిజానికి నేను నా చంచలహస్తాల నేస్తాన్ని కనిపెట్టని క్షణంలేదు. అవిఘ్నంగా కాపలాకాస్తూ గంటసేపు పైగా అక్కడ నిలబడ్డాను. ఆ పాముతలకాయగాడు, పాచికలు వేస్తూనే వున్నాడు తన భయంకర వ్యాపారాన్ని సాగించేందుకు. మరింత శ్రద్ధగా, మరింత దీక్షగా పరిశీలిస్తున్నాడు. మొట్టమొదటిసారి యెంతో గొప్పగా చెప్పారన్న సినిమాని కూడా నేనంతదీక్షగా చూడలేదని బాగా జ్ఞాపకం. ఏకాగ్రవాస్తవికత పరిపూర్ణ లలితకళలన్న అతీతం. సత్యం కలకాలం వర్ధిల్లాలి!

సాయంకాలం అయిదుగంటలనుంచి ఆరింటవరకూ వీధిలో నిలబడి కాలాన్ని మెరుపువేగంతో గడిపివేశాను. బిగువైన సన్నివేశాలతో, అసంఖ్యాకమైన నిర్ణయాలతో, సంఘటనలతో నేను గడిపిన ఆ గంటసేపునీ వర్ణిస్తూ కొన్ని గంటలసేపు గడపగలను. నన్ను ఆ సమయంలో ముసురుకొన్న నిరంతర అపాయాలు నా నరాల్లోని బలాన్నంతా స్వాధీనం చేసుకున్నాయి. ఇంతకుముందెన్నడూ నాకంత స్పష్టంగా తెలియదు- నడివీధుల్లో నిండు వెలుగులో జేబుదొంగతనం యెంత క్లిష్టమో, యెంత భీతావహమో నా కవగతమైందప్పుడు. ఇంతవరకూ నేను, జేబుదొంగతనానికి ధైర్యమూ, మాంత్రికుడికి మల్లే హస్తలాఘవమూ ఉంటే చాలుననుకున్నాను.

జేబుదొంగకి మానసికంగా కొన్ని లక్షణాలుండాలి. మనస్థైర్యం, యేకాగ్రత, (అన్నిటికన్నా ముఖ్యం) ధైర్యసాహసాలూ ఉండితీరాలి. అంతేకాదు. ఉదాసీన స్వభావుడై వుండాలి. చురుకుగా ఆలోచించగలగాలి. శస్త్రవైద్యునికి మల్లే అమోఘమైన అవధారణ శక్తి జేబుదొంగకుండాలని, యిరవైనిముషాలసేపు పరిశీలించినమీదట తెలిసింది. గాయపడ్డహృదయానికి కట్లువేస్తున్నప్పుడు క్షణం ఆలస్యం అయినా అపాయకరమే. అయితే, అటువంటి శస్త్రచికిత్స చెయ్యటానికి ముందు రోగికి మత్తుమందిచ్చి, అతనికి నిరోధించేశక్తి లేకుండాచేస్తాడు వైద్యుడు. కాని జేబుదొంగ మాత్రం శస్త్రచికిత్సను మెరుపులా చేసెయ్యాలి- ఆ మనిషి స్పృహతో వుండగానే.

పైగా చికిత్స చెయ్యవలసిన స్థలం యెప్పుడూ సూక్ష్మగ్రాహ్యంగా ఉంటుంది.

ఇక అటువంటి ఉద్రిక్తక్షణంలో జేబుదొంగ పిల్లైనంత వేగంగా చికిత్స చేస్తున్నప్పుడు, ఆ ఉద్రేకం కాని ఆవేశంకాని అతని ముఖంమీద ప్రస్ఫుటం కాకూడదు. అతని ముఖం ప్రశాంతంగా, నిర్లక్ష్యంగా, చిరాకుగా ఉన్నట్లుండాలి. కాని యెంతమాత్రం తన ఆవేశాన్ని బయట పెట్టుకోకూడదు. కౄరహంతకుడిలా కత్తిపోటు సమయంలో కన్నుల్లో కాంతి రానివ్వకూడదు. తనకు దొరికిన యెరను పట్టుకోవటానికి చెయ్యిచాపినప్పుడు దొంగ చూపులు మాత్రం స్నేహపూర్వకంగా, మర్యాదగా వుండి, ఒకవేళ అవతలివాణ్ని పొరపాటున కుదిపినట్లయితే వెంటనే సర్దుకుని వినయంగా క్షమాపణ చెప్పుకోవటానికి సిద్ధంగా వుండాలి. కార్యనిర్వహణ సమయంలో దొంగ మదుపుగానూ, శాంతంగానూ ఉన్నంత మాత్రాన సరిపోదు. అంతకు ముందునుంచీ అతను తన తెలివితేటల్ని, మానవస్వభావం గురించి తనకున్న పరిజ్ఞానాన్ని వినియోగించి తను యెంచుకున్న వ్యక్తి శారీరకంగానూ, మానసికంగానూ తన మోసానికి తగునో కాదో తెలుసుకోవటం అతని విధి. పరధ్యానంగా ఉన్నవాళ్లూ, నిర్లక్ష్యంగా ఉన్నవాళ్లూ యిందుకు తగిన మనుషులు. వారిలో కూడా, తొడుక్కున్న కోటుకి బొత్తాలు పెట్టుకోని వాళ్లనీ, హడావిడిలేకుండా తాపీగా నడుస్తున్నవాళ్లనీ సులభంగా సాధించవచ్చు. ఒక గంట తీవ్ర పరిశోధన నాకు నేర్పినదేమిటంటే– ఓ వందమందిలో.... ఒక్కొక్కప్పుడు అయిదువందల మందికీ ఒకళ్ళిద్దరికన్న యెక్కువుండరు. జేబుదొంగకి సరిపడినవాళ్లు అటువంటి అపూర్వ అవకాశాల్లోనే దొంగ తెలివి తేటలు అతని వృత్తికి వినియోగపడతాయి. అప్పటికీ, అతని ప్రయత్నం ఫలించకపోవచ్చును. దొంగ విజయం సాధించాలంటే అతనికి అనేక పరిస్థితులు కలిసిరావాలి సమయానికి. దొంగ తన పథకాన్ని ప్రయోగిస్తు నప్పుడు తననెవ్వరూ కనిపెట్టకుండా చూసుకోవాలి. దాన్నిబట్టి జేబు దొంగకి యెంత అనుభవం, ఆత్మబలం, ఎంత పరిశోధనా పటిమ అవసరమో తెలుస్తుంది. ఎవడైనా పోలీసువాడుకాని, గూఢచారికాని యేమూలనుంచైనా కనిపెడుతూ వుండొచ్చు. దొంగల్ని పట్టుకోవటానికి అధికారరీత్యా నియమితులైన వారిమాట అటుంచి, వీధుల్లో యెంతమంది జనం వుంటారు. అందులో కొందరు నాను మల్లే యెదుటివారి వ్యవహారాల్లో కుతూహలం పెంచుకొని

సంతృప్తిపడే వాళుంటారు. ఇటూ అటూ దుకాణాల్లో బోలెడు అద్దాలుంటాయి. వాటిల్లో అతని చేష్టలు ప్రతిబింబించవచ్చు. ఆ విషయం అతనికి తెలియక పోవచ్చును. అద్దాలేకాకుండా, కొట్లల్లో కిటికీల గాజుతలుపులు మరీ ప్రమాద కరం. కొట్లో గుమాస్తాలు కాని, కొనుక్కోవటాని కొచ్చినవారు కాని యథాలా పంగా ఆ గాజుతలుపుల్లోంచి చూసినప్పటికీ అతని దొంగతనం బయటపడి పోతుంది. అతను పడవలసిన బాధ దుర్భరమూ, అపాయకరమూను. ఒక్క అపరాధానికి నాలుగు సంవత్సరాలు చెల్లించవలసి వుంటుంది. చేస్తున్నప్పుడు చెయ్యివొణికినా, కొంచెం బలంగా లాగి, మనిషిని కుదిపినా, బంధింపబడటం ఖాయం.

నడివీధిలో నిండువెలుగులో జేబుదొంగతనం చెయ్యటంధైర్యసాహసాలతో కూడిన ఆ మానుషులకు గాని సాధ్యంకాదు. జేబుదొంగతనం యెంతో నీచమైననేరం అనట్లు దానిగురించి వార్తా పత్రికల్లో రెండుముక్కల్లో తేల్చి పారేస్తూ ఉంటారు- అది చాలా అన్యాయం అనిపించింది నా కా శ్రావణ మాసపు సాయంకాలంవేళ. విమానయానానికి ఎంత ధైర్యమూ పరిజ్ఞానమూ అవసరమో, క్లిష్ట పరిస్థితుల్లో ఒకచేతి గడియారాన్ని కాని, జేబులోని పర్సుని కాని దొంగిలించటానికి కూడా అంత అవసరం. సైనిక, రాజకీయ వ్యవహా రాల్లోకన్న యెక్కువ వ్యవహార నిపుణత కావలసి వుంటుంది. ఒక వేళ ప్రపంచం, అద్భుత కృత్యాలను, వాటి ఫలితాలనుబట్టి కాకుండా, వాటిని సాధించటానికి వ్యయపరిచిన నరాల బలాన్నిబట్టి నిర్ణయించినట్లయితే,(నీతినియ మాలను అతిక్రమించటం మాట అటుంచి) యీ వీధి దోపిడీదారుల చర్యల్ని బహిరంగ పరచటంలో అంత దురహంకారం ప్రదర్శితం కాదపోను. అన్ని రకాల చేతిపనుల్లోకీ- గౌరవ నీయమైనవి కాని, మరే రకమైనవి కాని- యీ లోకంలో జరుగుతున్న చేతిపనులన్నిటికన్నా యిప్పుడు నేను గమ నించినదే యెక్కువ కష్టమైనదీ, అపాయకరమైనదీను. ఇది కనక పరిపూర్ణంగా రూపొందినట్లయితే లలితకళలలో జమ కావచ్చును. మద్రాసులో, ఆ శ్రావణ మాసంనాటి నా అనుభవమూ, పరిశోధన మూలంగా యీ అభిప్రాయాలు నాలో స్థిరపడి పోయాయి.

అనుభవం ఒక్కటేకాదు... పరిశోధన మాత్రమేకాదు....ఒక విధంగా భాగ స్వామ్యం కూడా. నా కాకీచొక్కా నేస్తాన్ని కొంచెంసేపే శాస్త్రజ్ఞుడి

దృష్టితో పరిశోధించాను. తీవ్ర విమర్శ యెప్పుడూ సానుభూతిని ప్రేరేపిస్తుంది క్రమక్రమంగా, ఉద్దేశ పూర్వకంగా కాకుండా, అ నా లో చి త ం గా నన్ను ఆదొంగతోసమైక్యం చేసుకోవటం, అతని శరీరంలో ప్రవేశించి, అతని హస్తం చలనంలోసంలీనం కావటం జరిగి పోయింది. ప్రేక్షకుడిగా ఉండటానికి బదులు మనో లోకంలో, నేనే కర్త నైయాను. ఓ పావుగంట గడిచేసరికి నాప్రవర్తన నాకే ఆశ్చర్యం కలిగించింది. నా అంతట నేను వచ్చేపోయే మనుషుల్ని తగిన వాళ్లవునా, కాదా అని పరీక్షించటం ప్రారంభించాను. వారి కోట్లకి బొత్తాలుపెట్టి వున్నాయా, లేదా; పరధ్యానంగా వున్నారా, జాగ్రదావస్థలో ఉన్నారా; దగ్గరేవన్నా నోట్లకట్టలున్నట్టు సూచన లేవైనా ఉన్నాయా.... నా నేస్తంయొక్క నేర్పుకి ప్రతిఫలం లభిస్తుందా? జరుగనున్న సమరంలో తటస్థంగా ఉండటానికి బదులు, నేను హృ ద య పూర్వకంగా అతనికి మంచి అవకాశం లభించాలని వాంఛిస్తున్నట్లు విస్పష్టమై పోయింది. అతనికి కాయ శస్త్రలా సహాయం చెయ్యాలనే హృదయారాటాన్ని బలవంతంగా అణుచుకున్నాను. ఏదైనామంచి అవకాశం వచ్చినప్పుడు అతను గ్రహించ లేదని తోస్తే, ఇక్కడనుంచి “అడుగో .. అడుగో.... నీ క్కావల్సిన మనిషి ... ఆ లావుపాటాయన.... చేతుల్లో పెద్ద పెద్ద పువ్వుల గుత్తులు పట్టుకుని వెడుతున్నాడేం.... ఆయనే ...” అని సైగచెయ్యాలనే వాం ఛ మా త్ర ం బలీయంగానే ఉంది.

ఓసారి, దొంగ జనసమూహంలోకి తోసుకొని వెళ్లాడు. సరిగ్గా అదే సమయానికి పోలీసువాడొకడు అటువైపుకి వచ్చేసరికి నాకాళ్లు గజగజ వొణికి పోయాయి వాడు నన్నే పట్టుకుంటాడేమోనన్నట్లు. అతని భుజంమీద... కాదు... నా భుజంమీద యేదో బరువైన హస్తం పడినట్లు అనిపించించింది. అప్పుడు (హమ్మయ్య !) ఆ జేబుదొంగ యేమీ దొంగలించటానికి ప్రయత్నించ కుండా, న్యాయదేవత నౌకరు కంటపడకుండా యెలాగో జనం ఒత్తిడినుంచి తప్పించుకున్నాడు. ఇదంతా ఉత్సాహజనకంగానే వుంది కాని, అను కున్నంత ఉత్సాహకరంగా లేదు. ఆ దొంగతో నన్ను నేను సమైక్యం చేసుకుంటున్నకొద్దీ, అతనింకా అసలుదెబ్బ కొట్టలేదనే బాధ నాలో అధికమై పోతున్నది. అయిందానికీ, కానిదానికీ అతనంత సందేహిస్తుంటే, నాకు ఒళ్లుమండిపోతోంది. “ఏం‌విటిరా మొద్దూ, గుండె దిట్టంచేసుకొని పనికి

ఉపక్రమించవేం ? ఏదో ఒక అవకాశాన్ని వినియోగించుకో.... ప్రయత్నించి చూడు... నీకావిద్య తెలుసుననటానికి నిదర్శనంగా అయినా యేదో పొరటి చెయ్యవేం ?''

అదృష్టవశాత్తు, నేనతని చర్యల్లో శ్రద్ధవహిస్తున్నానని ఊహించుకో నైనా లేని నా మిత్రుడు నా అసహనానికి కించిత్తు చలించలేదు. అవే, అనుభవజ్ఞుడైన నిపుణుడికీ, తెలిసీతెలియని వాడికీ తేడా. ఘనవిజయం సాధించటానికపూర్వం ఎన్నిప్రయత్నాలు విఫలమవుతాయో నిపుణుడికి తెలుసు. ఆఖరున, ఆ అపూర్వ అవకాశం లభించేవరకూ ఓర్పువహించే నేర్పు అతనికి ఉంటుంది. కవి, తన మనస్సులో అసంఖ్యాకంగా వచ్చే వివిధభావాలను (అటువంటి అపరిపక్వ భావాలను అనుభవంలేని రశాభిమాని మాత్రమే పరిగ్రహిస్తాడు) లెఖ్ఖచెయ్యక, తన ప్రతిభనంతా యెప్పటికో రాబోయే ఉజ్జ్వల భావాన్ని వ్యాఖ్యానించటం కోసం గుప్తం చేసుకున్నట్లే, యీ నిర్భాగ్యజీవి కూడా, నావంటి ఆరంభశుడికెంతో ఆశగొల్పిన పంచలఅవకాశాలను జారవిడుచుకున్నాడు. ఇక్కడా, అక్కడా అనేకచోట్ల ప్రయత్నించి చూశాడు. చాలా జేబుల్ని పైపైన తడిమిచూశాడు. కాని, ఒక్కటి కూడా అతనికి అనువుగా, నిరపాయకరంగా లేదు. అయినా ఓరిమినంతా కూడ గట్టుకొని, లేని నిర్లక్ష్యాన్ని తెచ్చుకొని కొట్టువగ్గరనుంచి వదిగజాలవతలిం నడిచి, మళ్ళీ వెనక్కివచ్చాడు. ప్రతిఅవకాశాన్నీ పరీక్షిస్తూ, వాటివల్ల వచ్చే లభాలనూ, (నాకు అగమ్యగోచరమైన) నష్టాలనూ సరితూచుకుంటూ ఆలోచించుకుంటున్నాడు. అతని ప్రశాంతత, విసుగులేని పట్టుదల నన్ను సమ్మోహపరిచాయి. నాలో ఓరిమిలేకపోయినా, యెప్పటికో చివరికి విజయం సాధించకపోడనే నమ్మకం కలిగింది. నామట్టుకు నేనూ, అర్ధరాత్రి అయిపోయినాసరే అతనికేదో లాభం కలిగేవరకూ నా పరిశోధన మానకూడ దనే నిశ్చయించుకున్నాను.

చీకటిపడింది. నగరంలోని జనమంతా వీధుల్లోనే కనిపించే సమయం అది. బజారుకి వెళ్లేవాళ్లూ, సముద్రతీరానికి వెళ్లేవాళ్లూ, పార్కులికి పోయే వాళ్ళూ. సినిమాలకి వెళ్లేవాళ్ళూ. గుళ్లోకివెళ్లే ఆడవాళ్లు, ఆటలనుంచి తిరిగి యింటికిపోయే చిన్నపిల్లలూ.... వీధులనిండా కిటకిటలాడుతూ ఉంటాయి. పొద్దుటినుంచి ఉక్కిపోతూ యిళ్లల్లో కూర్చున్నవాళ్ళూ, ఆఫీసుల్లో పనిచేసిన

వాళ్ళూ, కాళ్ళూ చేతులూ ఊపుకుంటూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ చల్లగాలి సేవించటానికి బయలుదేరతారు. మళ్ళీ తెల్లవారితే ఒళ్లువొంచి పనిచెయ్యక తప్పదు. అది తెలుసుకొని అవయవాలన్నీ వీలైనంత స్వేచ్ఛ ననుభవిస్తున్నాయి. వాటికి కావలసింది కాంతి, సంతోషం, నూతనత్వం, వింతలూ వినోదాలూ. ఈ అవకాశంవల్ల కోతుల్ని పెట్టినకొట్టు మాత్రం బాగా లాభిస్తుంది. అంతకంతకు ఆ కిటికీముందు జనం సందడి యెక్కువై పోతోంది. ముందర వరసలో ఆడవాళ్లు- పక్షుల్లా కిచకిచమంటున్నారు. వాళ్ల వెనక పనివాళ్ళూ, తిరుగుబోతులూ చేరి నీచంగా వేళకోళాలాడుతూ తమ అల్పత్వాన్ని ఋజువుచేసుకుంటున్నారు. వాళ్లు గుంపులు గుంపులుగా చేరుతున్నకొద్దీ, ఆ కాకీచొక్కామనిషి లోపలికి తోసుకొని వెడుతున్నాడు. అప్పుడతన్ని చూస్తుంటే, గాజుతొట్టెలో నీళ్లల్లో యీదుతున్న చిన్న బంగారు చేప గుర్తుకొచ్చింది.

''చేస్తే యిప్పుడే ధైర్యంగా చే సెయ్యాలి... లేకపోతే అసలు చెయ్యనే లేదు'' అనుకున్నాను. ఇలా అనుకుంటూండగా, నేనున్నస్థలం కూడా పరిశోధనకి అంత అనువుగా లేదనే అసంతృప్తి కలిగింది. ఆ పనిజరిగే చోటుకి దగ్గరలో ఉండాలి. ఆ తమాషా యెలా చేస్తాడో సరిగ్గా చూడగలిగే టంత దగ్గరగా ఉండాలి. నేను అనుకున్నట్లు చెయ్యడం యేమంత సులభం కాదు! చిరుచేపలా జారి పోతున్నాడు. ఎంత గుమిగూడిన జనంలోంచైనా సునాయాసంగా చొచ్చుకుని పోగలడు. ఒక్కక్షణం వెనక అతను నాపక్క కొచ్చాడు. ఇప్పటికప్పుడే ఆ కొట్టు కిటికీ దగ్గరున్నాడు- గాజుతలుపు పక్కనే. అంటే కన్నుమూసి తెరిచేటంతలో అయిదారు వరసల ప్రేక్షకుల్ని తప్పించుకు పోయి వుంటాడు.

అతనికన్న యింకా నెమ్మదిగా, యింకా జాగ్రత్తగా అతన్ని అనుస రించాను అతని మీరించి చూపుల్ని మళ్లించకుండా. లేకపోతే నేను ఆ కిటికీ సమీపించేలోపునే యే కుడిపక్కకో, యెడం పక్కకో కంటికనిపించకుండా వెళ్ళిపోయేవాడు.... ఇంక ఖంగారు పడక్కర్లేదు.... అతను మొట్ట మొదటి సారిగా నిశ్చలంగా నిలబడ్డాడు. ''ఏదో కారణం లేకపోలేదు యీ మార్పుకి'' అనుకుని, అతని చుట్టు పక్కలఉన్న జనాన్ని ఒక్క మాటు త్వర త్వరగా

కలయ చూశాను. అందులో బాగా లావుగా ఉన్న ఒకావిడ కుడిచేత్తో నీరసంగా ఉన్న పదేళ్లపిల్లని పట్టుకుని, రెండోచేత్తో బజారుసంచీ పట్టుకుని నిలబడింది. సంచీలోంచి పెద్ద పెద్ద పొట్లాలు పైకి ఎత్తుగా కనిపిస్తున్నాయి. కాళ్లకి చెప్పులులేవు. ముదురు రంగు ముతకచీర పొట్టిగా కట్టుకుంది. ఈ విడకి కోతుల్ని చూసేసరికి సరదాపుట్టింది. నవ్వినప్పుడల్లా ఆవిడ స్థూల శరీరం తీవ్రంగాకంపించి, ఆవిడ చేతిసంచీలో సామాన్లన్నీ దడదడ లాడుతున్నాయి. ఈవిడ గంభీర మందహాసం కోతుల్నికూడా ఆకర్షించింది. చుట్టుపక్క లున్నవాళ్లు కూడా జంతువులను చూడటంమానేసి యీ విణ్నే వింతగా చూస్తున్నారు. ఈ వినోదాన్ని కలుగజేసిన వాళ్ల ఔదార్యాన్ని ప్రశంసిస్తూ తెగ సంతోషిస్తోందావిడ. టిక్కెట్టులేకుండా వినోదంచూపిస్తూంటే పేదవాళ్ల ఆనందానికి అంతులేదు. దేముడు వరమిచ్చినట్లుగా ఉంటుంది వాళ్లకి. ఈ విడైనా మరీ స్వార్థంతో సంతోషించలేదు. అస్తమానూ పక్కకి తిరిగి తన కూతురుతో అరవంలో చెబుతూంది కోతుల చేష్టల్ని సరిగ్గా చూడమని. అంతమందిలో సిగ్గుపడి ఆ పిల్ల తమాషా యెక్కడ చూడదోనని ఆవిడబాధ. ఈ మహత్తరజీవి- ఆయురారోగ్యాభివృద్ధిగాంచిన యీసుహాళ- సాక్షాత్తు ఆ మహాతల్లి భూదేవిలా ఉంది. ఆవిడ అమాయకపు ఆనందానికి జాలివేసి అప్యాయంగా ఆవిడ వొడిలో తలదాచుకుందామనిపించింది. హఠాత్తుగా నాకు కంగారుపుట్టింది. ఆ కాకీచొక్కా చెయ్యి క్రమక్రమంగా పాపం, ఆ లావుటావిడ బజారుసంచీ దగ్గరికి జరుగుతోంది. ఆ సంచీ అసలే తెరిచి వుంది. వస్తువులన్నీ లోపల చెల్లా చెదరుగా ఉన్నాయి- పేదవాళ్ల అజాగ్రత్త సంతా సూచిస్తూ.

"కొంపతీసి !.... యీ మహాసాధ్వి.... అమాయకురాలు.... ఆవిడ చేతిసంచీలోని డబ్బులమూటని తీసుకుపోడుకదా !'' నేనుమట్టుకు యిష్టపడను. అంతవరకూ జేబుదొంగతనం భలే ఆట అనుకున్నాను. చెప్పాను గా, అతనితో నన్ను ఐక్యం చేసుకున్నానని. ఇంతసేపు అతను పడుతున్న శ్రమ ఫలితంగా ఆఖరున మంచి బహుమానం లభించాలని ఆశించాను, వాంఛించాను. తీరాయిప్పుడు దొంగిలించే ప్రయత్నాన్నీ, దొంగిలింపబడబోయే వ్యక్తినీ చూశాను.... పాపం, ఆర్భాటంలేని అమాయకురాలు.... ఎంతో ఆనందంగా ఉంది.... అంట్లుతోముకుంటూ ప్రతిరోజే పనిమనిషైనా,

కష్టాన్నంతా మరిచి, యెంతో ఉత్సాహంగా ఉన్న సమయంలో, ఆ పేద రాలిని దోచుకుంటుంటే, కోపం పట్టలేకపోయాను. "చెయ్యి తియ్యి, దొంగ వెధవా!" అని అరుద్దామనుకున్నాను. "నీ వెధవ్వేషాలన్నీ యింకెవరి దగ్గరన్నా చూపించు.. యీ బీదముండని వొదిలేసెయ్!" నేను ముందుకి నడిచాను- ఆ దొంగకీ, బెదురుతూన్న చేతిసంచీకీ మధ్య నిలవాలని. నేను రెండడుగులు వేసేసరికి వాడు నన్ను తప్పించుకొని "క్షమించండి" అని వినయంగా, సరళంగా అంటూ వెళ్ళిపోయాడు. మొట్టమొదటిసారిగా అతని కంఠం విన్నాను. మరుక్షణంలో కాకీచొక్కావాడు జనసమూహంలోంచి తప్పించుకున్నాడు. నేను అడ్డువెళ్లటం ఆలస్యంగా జరిగిందనీ, అప్పటికే వాడి పథకం ఫలించిందనీ గ్రహించాను.

పోనీ, అయితేనేం, వాణ్నిమాత్రం వొదిలిపెట్టను. దూకుడుగా నేను కూడా జనాన్ని తప్పించుకుంటుంటే నా అడుగు ఒకాయనపాదంమీద పడింది. ఆయన నోరారా తిట్టుకున్నాడు. సమయానికి చూశాను కాకీచొక్కా వాడు ఆ వీధిమలుపు తిరిగాక చిన్నసందులోకి దూరటం. చురుగ్గా నడిచి వాణ్ని మళ్ళీ చూశాను. నాకళ్లను నేనే నమ్మలేకపోయాను. గంటన్నరనుంచి తదేకంగా నేను పరిశీలించిన ఆ చిన్నమనిషి ధోరణి హఠాత్తుగా మారి పోయింది. ఇంతవరకూ నేను చూసినంతసేపూ అతను నిలకడలేకుండా యిటూ అటూ తచ్చాడుతూ వ్యాపకం లేనివాడిలా కనిపించాడు. ఇప్పుడు ముంగీసలా గోడకంటిపెట్టుకొని హడావిడిగా ఆఫీసుకిపోయే బస్సు తప్పిపోతే ఆఫీసరు తిట్లకి భయపడి కంగారుపడిపోయే గుమాస్తాలా నడుస్తున్నాడు. ఇంతకుపూర్వం ముందూవెనకా చుట్టుపక్కలా చూసుకుంటూ నడిచేవాడు. ఇప్పుడు తలవంచుకొని తిన్నగా తనదారిని తను వడివడిగా పోతున్నాడు. నా అనుమానం బలపడింది. దొంగతనం చేసేసిన తర్వాత, ఆ స్థలంనుంచి వీలైనంత త్వరగా యెవరికీ తెలియకుండా బయటపడిపోవటం దొంగ అవలంబించే పద్ధతి. అంతే, సందేహంలేదు. వెధవ! ఆ అమాయకురాలి చేతిసంచీలోని డబ్బులమూటని అపహరించి వుంటాడు.

ఆ కోపంలో "ఆగు, దొంగవెధవా" అని గట్టిగా నలుగురికి తెలిసేలా అరవాలనిపించింది. కాని ధైర్యంచాల్లేదు. ఇంతకీ దొంగతనం జరుగు తూండగా నేను చూడలేదు. అంతా నేనూహించుకున్నదేకదా. అదీకాక,

ప్రభుత్వంపేరుతో న్యాయాధికారాన్ని చెలాయించటానికీ, తోటిమానవుని పట్టుకుని శిక్ష విధింప జెయ్యటానికీ అసామాన్యమైన ఆత్మ విశ్వాసం కావాలి. అటువంటి ఆత్మవిశ్వాసం నా కెప్పుడూలేదు. నాకు తెలుసు న్యాయం యెంత అపసవ్యంగా నడుస్తున్నదో, దాన్నెంత దురహంకారంతో అమలు జరుపుతున్నారో.... యీ కలికాలంలోనా న్యాయం ?

ఆ విధంగా నిర్ణయించు కుంటూండగా, అతనిలో మరోవింత మార్పు రావటం గమనించి మరింత ఆశ్చర్యపోయాను. రెండు మూడు సందులు దాటి పోయిన తరవాత ఆ అసాధారణ వ్యక్తి సరికొత్త నడవడిని అలవరచుకున్నాడు. తలవంచుకుని వడివడిగా నడవటం లేదింక. మామూలు మనిషికి మల్లే స్వేచ్ఛగా ఒక్కసారి ఒళ్లు విరుచుకుని కొంత సర్దుకున్నాడు. ప్రమాద స్థలం దాటిపోయాడు. అతన్ని వెన్నంటే వాళ్లెవరూలేరు. అపాయంగురించి ఆలోచించవలసిన అగత్యంలేదు. ఇంక స్థిమితపడొచ్చును. ఇప్పుడతను జేబులు కత్తిరించే దొంగకాదు. మామూలు మనిషి అయిపోయాడు— మద్రాసు వీధుల్లో సిగరెట్లుకాలుస్తూ నిర్లక్ష్యంగా నడచిపోయే లక్షలజనంలో అతనొకడు. ఏమీ యెరగనట్లు అమాయకపు ధోరణిలో సావకాశంగా, కులాసాగా, నాలుగువీధులు కలిసేచోటు దాటేశాడు. సిసలైన "రసికుని"కి మల్లే అతను యెదురయ్యే ప్రతి ఆడదాని చూపులకూ వెలకడుతున్నాడని ప్రస్ఫుటంగా తోచింది నాకు.

"అడుగడుగునా ఆశ్చర్యాలు వెదజల్లేవాడా! యింకెక్కడికోయ్"?

అప్పటికిమేము దేముడిగుడి కెదురుగాఉన్న చిన్నస్థలానికి చేరుకున్నాము. చెట్లన్నీ చిగిర్చి పచ్చగాఉన్నాయి. "ఎక్కడికయ్యా ? ఆఁ.... తెలిసింది! అక్కడున్న రాతిగట్టుమీద కూర్చుని కాస్సేపు విశ్రాంతి తీసుకుందా మనుకుంటున్నావుకదూ ? నిజఁవే మరి, సాయంకాలంనుంచి యిప్పటిపరకూ శ్రమించినమీదట బాగా అలిసి పోయివుంటావు". అబ్బే, ఆ ఇంద్రజాలికుడు రాతిగట్టుమీద కూర్చోలేదు. (పాఠకులు క్షమించాలి). అతనెంతో ధైర్యంగా, మానవుని అత్యంత అంతరంగిక అవసరాలనుతీర్చే చిన్నమురికికొంప వైపుకి దారి తీశాడు. లోపలికి ప్రవేశించి ఒక మూలగా కుర్చీలో కూర్చున్నాడు.

నాకు నవ్వొచ్చింది. కళాకారులందరూ, దొంగల్ని మినహాయించకుండా, ఒకే మానవజాతికి చెందినవారు. భయం వేసినప్పుడు కడుపులో

కలకలం బయలుదేరుతుందని అందరికీ తెలుసును- (అనేక యుద్ధరంగ వర్ణనలలో యీ సత్యం చెప్పబడింది). ఇప్పుడీ కాకీచొక్కామనిషి మంటల మధ్య సైనికుడిలాఉన్నాడు. ఊహలెంత చిత్రమైన వైనప్పటికీ, యెప్పటికైనా వాటికన్నా వాస్తవిక వైచిత్ర్యాలు విపరీతంగా కన్పట్టక మానవు. అసాధారణమైన వాటిని అసహ్యకరమైన వాటితో యెదిరించటానికి వాస్తవికతకు వెరపులేదు. అంతేకాదు- వాస్తవికత, సర్వసామాన్యమైన మానవలక్షణాలతో అసామానమైన వాన్ని సన్నిహిత పరిచే విద్రోహకారి. ఆ వీధిగుమ్మంవైపు చూస్తూ రాతిగట్టుమీద కూర్చుని (అంతకన్న నేను చెయ్యగలిగిందేముంది?) ఆలోచిస్తున్నాను. ఈ కళాకారుడు సరిగ్గా తన వృత్తికి తగినట్లుగానే ప్రవర్తిస్తున్నాడు. దొంగతనమే వృత్తిగా పెట్టుకున్నవాడికి, ఒక జేబుకత్తిరించిన తక్షణం ప్రశాంతమయిన యేకాంత స్థలం అత్యావసరం. దొరికిన సొమ్ము చూసుకుని, ఆ చోటీయిచ్చే వస్తువులను వదుల్చుకోవాలి. అయితే, అటువంటి మహాపట్నంలో, కొన్నివేల కన్నులు పరికిస్తూ వుంటాయి. అంత స్వల్ప వ్యవధిలో నాలుగు గోడలమధ్య యేకాంతం లభించటం అసాధ్యం. నేర విచారణ వృత్తాంతాలను వార్తా పత్రికల్లో చదివేవారికి, అనేకమంది అనుక్షణం ప్రతిస్వల్ప విషయాన్నీ పరిశీలిస్తూ వుంటారనీ, కొంతమందికి విపరీతమైన జ్ఞాపకశక్తి వుంటుందనీ, తెలిసే వుంటుంది.

అంతవరకూ దేనికి ? ఓ చిన్న ఉత్తరాన్ని చింపి ముక్కలుచేసి వాటిని పక్కనున్న చెత్తడబ్బాలో పారెయ్యండి.. దారిని పోయేవారిలో మూడొంతులు మంది ఆ విషయాన్ని కనిపెట్టివుంటారు. ఏమీతోచని కుర్రవాడైతే కుతూహలంతో ఆ కాగితం ముక్కల్ని యేరి కష్టపడి దగ్గరికిచేర్చి చదువుకొని సంతృప్తిపడతాడు. ఎవరింటికైనా వెళ్ళి సావిట్లో బల్లమీదున్న పుస్తకం తెరిచి చూస్తారనుకోండి. ఎవరో ముక్కూమొగం యెరుగని ఆడది డేగంటి చూపులతో మిమ్మల్ని కనిపెట్టి వుంటుంది. ఆ పుస్తకం కర్మంచాలక పోతే, వెంటనే వెళ్ళి పోలీసులికి మీగురించి వివరాలన్నీ యిచ్చేస్తుంది. ఏదైనా హోటలుకి భోజనానికి వెడతారు. హోటలు కుర్రాడొకడు (వాణ్ని మీరు అంతకు ముందెప్పుడూ చూసివుండరు- అయినా, లక్షమంది కుర్రాళ్లలో వాడెవడో యెవరు లక్ష్యపెడతారు) మనస్సులో మీ వ్యక్తిత్వాన్ని చిత్రించుకుంటాడు- మీ ముఖలక్షణాలనూ, మీ దుస్తులు, మీ తరహా..

మీజుట్టు.. మీజోళ్లు... మీగోళ్లు అందంగా ఉన్నాయో లేదో- అన్నీ అనాలోచితంగా పరిశీలిస్తాడు.

ప్రతికిటికీలోంచీ, ప్రతికొట్టులోంచీ. ప్రతి పరదావెనకనుంచీ, ప్రతిచోటు నుంచీ యేవో రెండుకళ్లు మన చర్యలను పరికిస్తూనే వుంటాయి. వీథుల్లో నడుస్తున్నప్పుడు మనల్ని యెవ్వరూ గమనించలేదనుకుంటాం. కాని, అనుమానానికి అవకాశం లేని కొన్నివేలమంది చూపులకు బలి అవుతాం. మన దైనందిన జీవితంచుట్టూ నిత్య నూతన ఆసక్తి దట్టంగా అల్లుకుని ఉంటుంది. ఈ కళావేత్త మంచి ఉపాయమే ఆలోచించాడు. పావలా డబ్బులతో పదినిమిషాలపాటు యేకాంతాన్ని కొనుక్కున్నాడు. దొంగిలించిన సొమ్ము లెక్కచూసుకునేందుకు తగిన సమయం, అనుమానాస్పదమైన కాగితాలను కాని, యితర వస్తువులను కాని వొదుల్చుకునేందుకు తగిన సురక్షితమైన స్థలం. అతనిచుట్టూ నాలుగుగోడలు, పైన యింటికప్పూ- నిస్సంకోచంగా, దొరికిన దొంగ డబ్బులు లెక్కపెట్టుకోవచ్చు. చివరికి, నేను కూడా- అతని అడుగుజాడల్ని అనుసరిస్తూ, ఆరుబయట అతనికోసం ఉత్సాహ నిరుత్సాహాలతో నిరీక్షిస్తున్న నేను కూడా అతనెంత సంపాదించాడో తెలుసుకోలేక పోయాను.

అయినా, ఆ జనసమూహంలోంచి అతను బయటపడ్డప్పుడే అనుకున్నాను- నా అంతటనేను స్వయంగా ఆ లావుపాటావిడ డబ్బులమూటలో యెంత ఉన్నదీ లెక్కచూసినట్టుగా- అతనికాట్టే గిట్టుబాటు కాలేదనే అనుకున్నాను. అతని ముఖంలో వ్యక్తమవుతున్న విసుగు, అతని నీరసం- వాలకం, యాంత్రికంగా నడవటం- అన్నీ స్పష్టంగా చెపుతున్నాయి- అతను సాయంకాలంనుంచీ పడ్డ శ్రమకి తగిన ఫలితం ముట్టలేదని. అయినా ఆ మూటలో యేముంటాయి కనక? మహా అయితే, ఇంటి తాళంచెవి, కాసిని వక్కలు, ఒకటి రెండు రూపాయల చిల్లర డబ్బులు- అన్నిగంటలసేపు చమటోడ్చి శ్రమిస్తే లభించిన ఫలం! అయితే, ఆ లావుటావిడకి ముట్టుడు పాపం; యెంతో నష్టం కలిగించనిపించి, ఆవిడ కళ్లల్లో నీరు నిండివుంటుంది. పదిసార్లు చుట్టుపక్కలవాళ్లని పిలిచి జరిగిన విషాద సంఘటనను వివరించి వుంటుంది. పదిసార్లు ఆ చేతిసంచీ చులిపి చూసుకొని వుంటుంది. పదిసార్లు ఆ దొంగని దుమ్మెత్తి పోసివుంటుంది. ఆ దొంగ కూడా ఆవిడంత బీదవాడే.

అందుకే, మొదటిచూపులోనే, అతనికి తన కష్టార్జితం తన అవసరాలకు చాల చనిపించి వుంటుంది. ఈ నిజం నాకిప్పుడు ప్రత్యక్షంగా నిదర్శనం కానున్నది. అతనికి పట్టిన ఈ నికృష్టస్థితిలో నీరసంగా మరో వందగజాలు నడిచాడు. దారిలో చెప్పులదుకాణం కనిపిస్తె ఆగి, గాజుబీరువాల్లో పెట్టిన అందమైన జోళ్లవైపు ఆశగా చూశాడు. ప్రస్తుతం తన పాదాలను కప్పటానికి ప్రయత్నిస్తున్న తోలుముక్కల స్థలాన్ని ఆక్రమించేందుకు చవకగా దొరికే చెప్పులకోసం వెతికాడు. మద్రాసురోడ్లను చప్పుడుచెయ్యకుండా నిశ్శబ్దంగా, రబ్బరు, క్రేపుజోళ్లతో తొక్కుకుపోయే వారికన్న ముందర ఇతనికి కొత్తజోళ్లు అత్యవసరమని తోచాయి. తన వ్యాపారాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాలంటే కొత్తజోళ్లు అవసరం. కాని, అంతలోకే అతనికన్నుల్లో నిరాశ, నిస్పృహ తాండవించాయి. అధమం అఖరురకం జోళ్లకోసం ఖర్చుచెయ్యగలిగినంత సొమ్మైనా సంపాదించలేక పోయాడని అతని చూపులే చెబుతున్నాయి. నిస్పృహతో నిట్టూర్చి కాకీచొక్కా ముందుకి నడక సాగించాడు.

ఇంకెక్కడికి ? మళ్లీవేటకి బయలు దేరుతున్నాడా ? తిరిగి తన శక్తి నంతా స్వల్ప ప్రతిఫలంకోసం ధారపోస్తాడా ? ''ఒద్దయ్యా, పిచ్చివాడా ! ముందు కాస్త విశ్రాంతితీసుకో''. నా భావాలను గ్రహించినట్టుగా, నా కోరిక లన్నీ తంతిద్వారా అతనికి చేరినట్టుగా, అతను పక్కనున్న సన్నటిసందులోకి తిరిగి, అక్కడున్న చవకరకం హోటలుముందు ఆగి, స్తంభానికి కట్టిన బోర్డు మీది ధరలు చదువుకున్నాడు - లోపలికి ప్రవేశించడానికి సాహసించక పూర్వం. రెండుగంటలసేపు గుండెదడతో, అత్యంత శ్రద్ధాసక్తులతో అతని చర్యలను పరిశోధించి, అతనిలో నిగూఢమయివున్న మర్మాన్నంతా విస్పష్టం చెయ్యాలని నిర్ణయించుకున్న నేను అతన్ని అనుసరించానని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఓ వార్తాపత్రిక కొనుక్కుని ముఖానికడ్డం పెట్టుకుని, అతనికి కాస్త దూరంలో మరోకుర్చీలో కూర్చున్నాను. నేనంత అతి జాగ్రత్త పడటం అనవసరమే అయింది. ఆ జేబుదొంగచచ్చేటంత అలసటతో, ఆకలితో ఉన్నాడేమో, తన గొడవతప్పించి యితరుల విషయం పట్టించుకునే స్థితిలో లేడు. బల్లమీద బట్టకి బదులుగా పరచిన తెల్లకాగితాన్ని తేరిపారిచూస్తూ నిశ్చలంగా కూర్చున్నాడు హోటలు కుర్రాడు పూరీలు పట్టుకొచ్చేవరకూ. వాటినిచూసీ చూడటంతోనే అతని బక్కపలచని చేతులు ఆత్రంగా

లాక్కున్నాయి వాటిని. ఆకలిగొన్న సింహంలా తినటం మొదలు పెట్టాడు. అతనికిసరిగ్గా తిండి దొరకటం లేదనుకుంటాను. పొద్దుటినుంచీ యేమీతిని వుండడు. ఒకవేళ నిన్నటినుంచీ వస్తున్నాడేమో. అతను చెప్పిన ప్రకారం హోటలుకుర్రాడు పట్టుకొచ్చిన పాలగ్లాసు చూడగానే అతనిపైన మరింత జాలేసింది. పట్నవాసపుదొంగ పాలుత్రాగటం !

ఇటువంటి అతిస్వల్ప విషయాలే, నిప్పురవ్వ గడ్డివప్పపైనవడి అగ్ని జ్వాలలు రేపినట్టు, మనోప్రపంచాన్ని విజ్ఞానపు వెలుగులతో నింపివేస్తాయి. ఆ సమయంలో, (ప్రజలు న్యాయప్రకారం నేరస్తునిక్రింద జమకట్టే)జేబుదొంగ యెంతో అమాయకమైన, పసితనం చిందులాడే, స్వచ్ఛమైన తెల్లనిపాలు మెల్ల మెల్లగా గుటకలు వేస్తోంటే "దొంగ" అనిపించలేదు నాకు. నామరూపాలు లేని "నికృష్టజీవుల్లో" అతనొకడు. ఈ విశాలవిశ్వంలో నిలువ నీడలు లేక, కడుపుచిచ్చుతో అల్లాడే లెక్కలేని పేద ప్రజలలో ఒకడు! కర్తవ్యంలదన్న ఆసక్తి, ఆతనితో నా కొక విధమైన అనుబంధాన్ని యేర్పరిచింది.

విశ్వమానవత్వపు వివిధరూపాల్లో- నగ్నత్వం, గాఢనిద్ర, పరిశ్రమ- రక్తమాంసాలుకోరే ప్రతి అత్యవసర విషయంలో మనుషులను మంచీ చెడూ అనీ, గౌరవనీయులూ అగౌరవనీయులనీ, విశ్వాసపాత్రులూ విశ్వాస ఘాతకులూ అంటూ కృత్రిమ విభేదాలను కల్పిస్తారు. ఆ కృత్రిమ కవాటాలు అప్పుడే కూలిపోతాయి. చివరికి మిగిలేదల్లా ఆకలిదప్పులతో అల్లాడిపోయే ఆ నిర్భాగ్యజీవి మాత్రమే. నాకూ, నావంటి ప్రతిమనిషికీ అవసరమైనట్టే అతనికీ నిద్రవాకాలి, విశ్రాంతికావాలి.

అతనా విధంగా గ్లాసులో ఒకచుక్క మిగల్చకుండా పాలు త్రాగు తూంటే, ఒక్క ముక్కరాల్చకుండా రొట్టెలుతింటూంటే విస్తుబోయి చూశాను. అంతలోనే, అవమానంతో కృంగిపోయాను. అంత కుతూహలముతో అతని కష్టభరితమైన వృత్తిని పరిశీలిస్తూ, అతన్నంతసేపు వెంటాడుతూ ఆఖరుకి నాలుగు డబ్బులైనా సాయంచెయ్యలేక పోయాను. ఏవిధంగా అతన్ని పలుకరించాలో, యేవంక పెట్టుకుని అతనికి ధనసహాయం చెయ్యాలోనని, బుర్ర చించుకున్నాను. అయినా మనతత్వం యెంత విచిత్రమైనది! సాధించ వలసిన నిర్ణీతక్షణం ఆసన్నమయే సరికి, వింతగా ప్రవర్తిస్తాం. సహాయం కోసం పరితపించిపోతున్న తోటిమానవుణ్నీ మనలనూ వేరుచేసే, సన్ననిగాలి

పొరను చీల్చుకుని దారిచేసుకుని ముందుకు సాగిపోవటానికి ధైర్యంచాలక పిరికిపందల్లా వెనుకంజవేస్తాం. అయితే, సహాయం అపేక్షించని వాళ్లకి సహాయం చెయ్యగలగటం యెంతకష్టమో అందరికీ తెలుసును. ఈ అర్థించక పోవటమే అతనికి మిగిలిన ఆఖరిఆస్తి- అదే-ఆత్మాభిమానం! ముష్టివ్యాపారం సాగించేవాళ్లకి మాత్రమే అర్థించటం సులభ సాధ్యమవుతుంది. అందుచేత వాళ్లకు సహాయం చెయ్యటంకూడా సులభమే. ఆ అవకాశాన్ని కల్పించి నందుకు వారికి కృతజ్ఞత తెలుపుకోవలసి వుంటుందికూడా. కానీ, యిప్పుడు నేను చూస్తున్న మనిషి ఒక తరహాకు చెందిన అభిమానస్తుడు. తనస్వేచ్ఛనూ, జీవితాన్నీ అయినా లెక్క చెయ్యక పోవచ్చునుకాని, ముష్టెత్తుకుని మానాన్ని మాత్రం చంపుకోడు. అందువల్ల అతన్ని నిందించేందుకు మనకధికారంలేదు. చెయ్యిచాచి అడిగేకన్న చాకచక్యంతో దొంగతనంచెయ్యటం అతనికి మేలనిపించివుంటుంది.

నేనుకనక దురభిప్రాయపడి సహాయం చేస్తానన్నట్లయితే, అతనెంత విపరీతంగా బాధపడతాడు, యెటువంటి జీవన్మరణబాధ ననుభవిస్తాడు? అంతేకాదు. అతను చాలా అలిసిపోయినట్లు కనిపిస్తున్నాడు. అతన్నీ సమయంలో కలత చెందించటం భావ్యంకాదు.

తిరిగ్గా విశ్రమించటానికి కుర్చీని గోడవైపుకి తోశాడు. ఇప్పుడయితే తల గోడకాన్చి కులాసాగా కుర్చీలో జార్లపడచ్చును. అతనిదళసరి కనురెప్పలు మూసుకున్నాయి. కునికిపాట్లు పడుతున్నట్లున్నాడు. అప్పుడతని ఆకారం చూస్తే భయంవేసింది - వెల్లవేసిన జైలుగదిలా ఉన్నాడు. ఆ చొక్కా చేతికున్న పెద్దచిరుగుచూస్తే, అతన్నిప్రేమతో దయతోచూసే భార్యగాని మరే ఆడదిగాని అతనికి లేరనితెలుస్తోంది. అతని జీవితాన్ని — గాలి, వెలుతురు లేని చిన్నగది... అందులోకుక్కి మంచం.... సొట్టలుపడిన సూటుకేసు... ప్రతినిత్యం పోలీసుల భయంకర పదధ్వని వినిపిస్తుందని, తలుపుధన్నుమని చప్పుడవుతుందనే భయ భ్రాంతులతో..... కడుపులో ఆకలితో,.. బుర్రలో ఆలోచనలతో,..యీ విధంగా ఊహించుకున్నాను- దుమ్ముకొట్టిన తలకాయను గోడకాన్చి, కృశించిన దేహాన్ని కుర్చీమీద జార్లవేసి అతను కునుకుతీసిన రెండుమూడు నిముషాల్లోనూ.

హోటలు కుర్రాడు బల్లమీదించి ప్లేట్లూ, గ్లాసులూ, చెంచాలూ అన్నీ తీస్తూ అధికారయుతంగా గడబిడిచేస్తున్నాడు. నిజమే, అంత పొదుపుచేసే అతిథిని అట్టేసేపు నిలవనివ్వకూడదు. నేను చెల్లించవలసింది చెల్లించేసి వీథులోకి వచ్చేశాను. నేను అట్టేసేపు ఆగనక్కర్లేకుండా కాకీచొక్కా వీథులోకొచ్చేశాడు నన్ను గమనించకుండానే. అతన్ని అనుసరించాను. అతను ఆలోచనల్లో మునిగిపోయినట్టు కనిపించాడు. అతని పరిస్థితి చూస్తూంటే, అంతవరకూ యెరుగని యేదో నూతన కళాసృష్టిని తిలకించాలనే ఉత్సాహం, సరదా, ఆసక్తితో ఆ సాయంకాలం ఉన్నట్టుగా లేదు నా మనస్సు. అంతవరకూ అణగిపోయిన ఆదుర్దా అంతకంతకు అధికమై దుర్భరమైపోతున్నది- అతను మళ్లీ ఆ నడివీధివైపుకి దారితీస్తూంటే.

"నీయిల్లు బంగారం కానూ! మళ్ళీ యిందాకటిచోటికే- ఆ కోతులు ఆడే దుకాణం దగ్గరికే వెళ్లేటంత మూర్ఖుడివా? తన సొమ్ము పోయిందని తెలుసుకోగానే ఆవిడ యీపాటికే పోలీసులతో చెప్పివుంటుంది- వాళ్లు నిన్ను పట్టుకోవటానికి సిద్ధంగా ఉండివుంటారు. ఈ ప్రమాదం సంగతి అటుంచి, యివాళ్టికి నీపని చాలిస్తేనే నీకు మంచిది. మళ్ళీ కొత్త ప్రయత్నం ప్రారంభించకు. అందుకు తగిన స్థితిలో లేవు. బాగా అలిసిపోయావు. ఎటువంటి కళాపూరితమైన పనైనాసరే, అజాగ్రత్తగా యెవరుచేసినా అది చెడిపోయితీరుతుంది. నీకిప్పుడు కావల్సింది విశ్రాంతి. ఇంటికి వెళ్ళి హాయిగా పడుకో. ఇవ్వాళ మాత్రం నువ్వు మరోగొడవ తలపెట్టకు.

ప్రథమ ప్రయత్నంలో అతను తన సామర్థ్యాన్ని ప్రదర్శించి వుండవచ్చును కాని, యిప్పుడతను బాగా అలిసిపోయిన మూలాన్ని యేదో అవకతవక పని చెయ్యటం ఖాయం- అనే అభిప్రాయం నాలో యెంతబలంగా నాటుకుందో చెప్పటానికి మాటలు చాలవు. అయితే, సందులుదాటి ఆ నడివీధి చేరుకునేసరికి యేకారణం వల్లనైతేనేం, నా ఆదుర్దా అధికమైపోయింది. "ఏంచేసినా సరేకాని, ఆ కోతులదగ్గరికి మాత్రం మళ్ళీ వెళ్లకు!" ఆ మాటలు నా పెదవులమీద నిలిచాయి. నా చెయ్యి ముందుకి సాగింది- అతన్ని రెక్కపట్టుకు ఆపేందుకు.... అతను సరిగ్గా నాలుగువీధులు కలిసే చోటు దాటి, యిందాకటి ఆడమనిషిని కొల్లగొట్టిన చోటికి- ఆ కోతుల దుకాణం వైపుకి దారితీస్తూండగా... నా కోరికలన్నీ అతని కర్థమవుతున్నట్టుగా,

హఠాత్తుగా పక్కకి తిరిగి కుడిచేతివైపుకి దారితీశాడు. అక్కడున్న భవనం వైపుకి యేంతో దర్జాగా తన స్వంతయింటికేనన్నట్లుగా నడిచాడు. నాకు తెలుసా భవనం. మద్రాసులో కంతటికీ ప్రఖ్యాతిగాంచిన వేలం దుకాణం.

ఆ క్షణంలో ఆ నిగూఢ మనిసి వింతప్రవర్తన చూసి అంతులేని ఆశ్చర్యాన్ని పొందాను. నేనతన్ని అర్థంచేసుకుందుకు ప్రయత్నిస్తూండగానే, అతనిలో యేదో శక్తి నాకోర్కెలను అమలు జరిపిస్తున్నది. ఆసాయంకాలం నేను వెళ్లాలనుకున్న కొన్ని వందల భవనాల్లో యిదొకటి ముఖ్యం వైనది. ఇక్కడ నేననేకసార్లు కాలాన్ని ఉత్సాహంగా, ఆనందంగా, యిష్టంగా గడిపాను. ఒక్కొక్కప్పుడు వస్తుప్రదర్శనశాలల్లోకన్న విలువైన, అందమైన వస్తువాహనాలిక్కడ ఉంటూ వుంటాయి. స్థలం అదే అయినప్పటికీ, అక్కడి వస్తువుల్లో ప్రతినిత్యం వైరుధ్యం గోచరిస్తుంది. మద్రాసులో చూడవలసిన ముఖ్యస్థలాల్లో యిదొకటి. ఇదంటే నాకెంతో యిష్టం. మద్రాసు నగరంలో జీవనాన్ని యీ స్థలం స్పష్టంగా వ్యక్తపరుస్తుంది. రోజూ సజీవంగా సంచరించే చక్కని మృగం హఠాత్తుగా ఒకనాడు కసాయివాడి యింట్లో నామ రూపాలులేకుండా ముక్కలు ముక్కలుగా పడివున్నట్లే, మామూలు గృహంలో ఒకచోట చేర్చి అందంగా అలంకరింపబడినవే యీ వేలం ప్రదేశంలో ఒకదానికీ మరొకదానికీ సంపర్కంలేకుండా విడివిడిగా పడి వుంటాయి. ఇక్కడ పవిత్రమైనవాటికీ, అపవిత్రమైనవాటికీ, సామాన్యమైన వాటికీ, అపురూపమైనవాటికీ భేదం లేకుండా, ప్రపంచములోని నానారకాల వస్తువులూ గందరగోళంగా పడివుంటాయి. ఈ వేలం స్థలంలో ప్రదర్శితమైన ప్రతివస్తువు డబ్బుగా మార్చటానికే.... మంచాలు, బల్లలు, తివాసీలు, గడియారాలు, గొప్ప గొప్పవాళ్ల ఫొటోలు, శిల్పాలు, అద్దాల బీరువాలు, విదేశాలకుచెందిన వింతవస్తువులు, సైకిళ్లు, పురాణగ్రంథాలు, చెడిపోయిన గ్రామఫోనులు, అవసరమైనవి, అనవసరమైనవి, చెత్తసామానులు, విలువైన శిల్పాలు, పెద్దవి, చిన్నవి, సిసలైనవి, కృత్రిమమైనవి, పాతవి, కొత్తవి- అన్నీ అక్కడ గడబిడగా చేర్చటం- రూపాయల్లుగా మార్చటానికే. ఆకర్షణీయమైన వాటినీ, అందమైనవాటినీ- అసహ్యకరమైనవాటితో కలిపి తోసేస్తారు ఈ యంత్రంలోకి. ఈ యంత్రం వాటినన్నింటినీ పొట్టలోపెట్టుకొని వాటి విలువను నాశనంచేస్తుంది. ఈ క్రూరం(వయిన అగ్నిగుండం ప్రతివస్తువునూ

నిర్దాక్షిణ్యంగా కరిగించివేస్తుంది. మానవ ఆడంబరాలకూ, మానవ అవసరాలకూ మధ్య వర్తకం సాగించే యీ విశాల విక్రయస్థలంలో- యీ విపరీత యంత్రాగారంలో ప్రపంచంలోని వైవిధ్యమంతా గందరగోళంగా, వికృతంగా కనిపిస్తుంది.

కళ్లు తెరుచుకుని బుర్ర ఉపయోగించే వాళ్లెవరైనాసరే, పురాతన వస్తు శాస్త్రాన్ని నేర్చుకోవాలన్నా, గ్రంథవివరాలను సేకరించాలన్నా కళల చరిత్రలను చదువుకోవాలన్నా యింతకన్న మంచి ప్రదేశాన్ని పొందగలుగుతారా ? ముద్రాశాస్త్రాన్ని కాని, (అంతకన్న ముఖ్యంగా) మానవతత్వాన్నికాని అర్థం చేసుకోవటాని కింతకన్న మంచి అవకాశం లభిస్తుందా ?

యజమానులను మార్చుకోవటానికే యిక్కడికిచేరి, అక్కడున్న కొద్దిక్షణాలసేపు మాత్రం ఆ బానిసత్వంనుంచి విముక్తిచెందే వస్తువులలో యెంతోవైరుధ్యం కనిపించినట్లే — ఉత్సాహంతో మెరిసే కళ్లతో, బేరం చెయ్యాలనే ఉద్రేకంతో ఆ విక్రయస్థలానికి గుంపులు గుంపులుగాచేరే జనంలో యెన్నిజాతులు, యెన్నికులాలు, యెన్నిమతాలు, కనిపిస్తాయి ! గొప్ప వ్యాపారస్థులు పొడుగుకోట్లు తొడుక్కుని, తెల్లని ఖద్దరుటోపీలు పెట్టుకున్నవాళ్లు, వాళ్లపక్కని చిన్నచిన్న దుకాణదారులు, చవగ్గా సామాను కొనుక్కుని తమకొట్లనిండా నింపుకుని యెక్కువధరకి అమ్ముకుందా మనుకునేవాళ్లు, బోలెడుమంది. వారిలో మధ్యతరగతి కుటుంబీకులు, మిలిటరీలో పనిచేసిన వాళ్లు, రైల్వేపనివాళ్లు, గుమాస్తాలు, అవకాశం దొరికితే చవగ్గా కొట్టేద్దామని చూస్తూవుంటారు. కొంతమంది, గొప్ప గొప్పవాళ్లు కోరినవస్తువులకి పట్టుదలగా ధర పెంచుతారు వాళ్లనేడిపించటానికి.

చివరికి, పుస్తకాలకు చర్మాలు అతుక్కుపోయిన గ్రంథాల యాధికారులు సయితం యెలాగో వీలుచేసుకుని వచ్చి, దళసరి కళ్లాద్దాలను సరిచేసుకుంటూ తాళ పత్రగ్రంథాలమ పరిశీలిస్తూవుంటారు. అందంగా అలంకరించుకున్న ఆడవాళ్లు.... ఖరీదైన ముత్యాలనగలు పెట్టుకుని... నెమలిపించంలా పమిట కప్పుకుని.... మొదటివరసలో, ముందేనౌకర్లనుపంపి యేర్పాటు చేసుకున్న స్థలాల్లో కూర్చుంటారు. ఒక మూలగా, గొప్ప గొప్పవ్యాపారస్థులకు సలహాదారులుగా ఉండే అభిజ్ఞులు నుంచుంటారు. మధ్య మధ్య సామాన్యప్రజలు కనిపిస్తూవుంటారు. వ్యాపారదృష్టితో కాకుండా, వైజ్ఞానిక దృష్టితోకాకుండా,

కళారాధన కోసంకాకుండా, ఉద్రికుతూహలంతోకాని, లేకుంటే కాలక్షేపం కోసంకాని వచ్చినవాళ్లుంటారు. ఈ వినోదం కోసం వారు వ్యయం చెయ్య వలసిందేమీవుండదు. అక్కడున్నవాళ్లని ఉత్సాహపరచటంకాని,నిరుత్సాహ పరచటం కాని వాళ్లకి సరదా.

ఎవరెవరు యెందుకోసం ఆ స్థలానికొచ్చినదీ, వారిముఖ కవళికలే చెబుతున్నాయి. అయితే, ఒక్కరకం మాత్రం- యిక్కడికి రాగానేనెప్పుడూ చూడలేదు. వస్తారని ఊహించుకోనైనాలేదు.... అదే ... జేబుదొంగలరకం. అయినా, నా మిత్రుణ్ని చూడగానే, వెంటనే మనసుకి తట్టింది. కొనేవాళ్లూ ప్రేక్షకులూ అంతాయేకగ్రీవంగా వేలంపాటలో లీనమై పోయివుండగా, అతనిక్కడికి రావాటానికి గల కారాణాన్ని వ్యాఖ్యానించు కోవలసిన అవసరం కలగలేదు.... బహుశా మద్రాసునగరంలో అతను తన శిల్పచాతుర్యాన్ని ప్రయోగించటానికి యింతకన్న మంచిప్రదేశం వుండదు. అటువంటి వేటగాడికి తగినస్థలంయిదే. కావలసిన పరిస్థితులన్నీ తమాషాగా సానుకూలమైపోయినై- నిలుచోవటానికి స్థలంలేనంతగా కిక్కిరిసిన జనం, వేలంపాటలో నిమగ్నమైన మనస్సులూ, యితర విషయాలన్నిటినీ విస్మరించేటంత ఉద్రేకం, ఉత్సాహం.... జేబుదొంగలికి బాగా పనికల్పించే గుర్రపుపందెముల్లోనూ, రైల్వేస్టేషన్లలోనూ తప్ప- అప్పటికప్పుడు డబ్బుచెల్లించే పద్ధతిపైన వ్యాపారంసాగే స్థలం ప్రపంచంలో కల్లా వేలంపాడే చోటొక్కటే ననుకుంటా, పైగా చెల్లించే సొమ్ముకూడా పెద్దమొత్తాలే. అంచేత ప్రతిజేబులోనూ నోట్ల కట్టలు వ్రేలాడుతూ వుంటాయి. చంచల హస్తాల పెద్దమనుషులికి మంచి అవకాశాలు లభించే చోటేదైనావుంటే- యిదే. నా కిప్పుడు తట్టింది అసలు సంగతి. నా మిత్రుడు సాయంకాలం చేసినది సాధకంమాత్రమే.... చెయ్యి సుళువు చేసుకోవటానికే.... అసలుపెద్దదెబ్బ వెయ్యటం యీ ప్రదేశంలోనే.

ఏదెలావున్నా, నాకుమట్టుకు, నిర్లక్ష్యంగా మెట్లెక్కి లోపలికి ప్రవేశించబోతున్న అతని చొక్కా పట్టుకు లాగాలనిపించింది. "ఏయ్, బుద్ధి లేదూ, తాటికాయలంత అక్షరాలతో యెర్రగా వెలుగుతూ, మూడుభాషల్లో అరుస్తూన్న బోర్డు కనిపించటం లేదూ ?"

జోపుడి తిరడర్ గళ్ జాగ్రదై.

జేబు దొంగలున్నారు జాగ్రత్త.

బివేర్ ఆఫ్ పిక్‌పాకెట్స్.

''గుడ్డివాడివా, వెర్రివెధవా ? నీలాంటివాళ్ల గురించే దాన్నక్కడ తగిలించారు. లోపల పదిపన్నెండు మందైనా పరిశోధకులుండి వుంటారు. నా మాట విను, యివాళ నీకు మంచిరోజుగా కనిపించటంలేదు.''

బోర్డుకేసి ప్రశాంతంగా చూసి, యీసారి, అతనికి కాబోయే రక్షకుడైన నన్నూ, నా భావాలనూ లెక్కచెయ్యకుండా, రాకీచౌక్కా లోపలికి ప్రవేశించాడు. అతను భవనం మేడమీదికి వెళ్లాడు. ఆ స్థలాన్నే ఎందుకు యెంచుకున్నాడో అర్థంచేసుకోవటం సులభమే. క్రిందిభాగంలో, వాడుకున్న వస్తువులను అమ్ముతున్నారు- బీరువాలు, డ్రాయర్లు... మొదలైనవాటిని. పాతసామాను వ్యాపారం చేసేవాళ్లూ, చిన్నవ్యాపారస్థులూ చాలా జాగ్రత్త మనుషులు. పల్లెటూరి వారికి మల్లే పంచ బిగదీసి నడుముదగ్గర డబ్బుల మూటని గట్టిగా దోపుకుంటారు. మేడమీది భాగంలోనే పుస్తకాలు, శిల్పాలు, ఫొటోలు, ఆభరణాలు, యింకా అనేక విలువగల వస్తువులూ అమ్మకానికుంటాయి. కొనేవాళ్లుకూడా జేబుల్లో పెద్దపెద్ద నోట్లకట్టలు పెట్టుకొని వుంటారు. అతన్ని అంటిపెట్టుకొని తిరగటం మహాకష్టమైపోయింది. కనిపించిన నోటీసులన్నీ విజ్ఞానిలా పఠిస్తూ, అవకాశాలను పరీక్షిస్తూ, యిక్కణ్నించి అక్కడికీ, అక్కణ్నించి యిక్కడికీ చకచకానడిచి వెళిపోతున్నాడు. ఆఖరుకీ యెలాగో మేడమీదున్న మూడోగదిలో విదేశీయవస్తువులు వేలం జరుగుతున్నచోట నిలవటానికి నిర్ణయించుకున్నాడు. గదిలో అమ్మకానికున్న వస్తువులు చాలా విలువైన వస్తువులై వుంటాయి నిస్సందేహంగా, అందుకే, జనసమర్దం అంత యెక్కువగా ఉందాగదిలో. గదిగుమ్మాని కడ్డంగా ఓ గుంపు చేరింది. లోపలికి ప్రవేశించేందుకు అవకాశం లేదు. వేలంవేసే అతని బల్లదగ్గరికి చేరటంకాని, అధమం అతన్ని చూడటంకాని మాకుమల్లే ఆప్పుడొచ్చినవాళ్లకు సాధ్యంకాదు. ఆ బల్లకీ గుమ్మానికీ మధ్య స్థిరమైపోయినట్టు వరసల్లో మనుషులు కిక్కిరిసి వున్నారు. మునివేళ్లమీద నిలబడి తలకాయలమీంచి చూస్తే యెలాగో ఆ వేలంపాడే అతని ముఖం, అతని చేతిలోని సుత్తి కనిపించాయి- అంతే. ఆ తెల్లని దంతపు సుత్తిని చేత్తో పట్టుకొని అతను సంగీత సమ్మేళనాన్ని నిర్వహిస్తున్న వానికి మల్లే జనాన్ని ఉండుండి ఉత్తేజ పరుస్తున్నాడు.

ఒక మామూలు సంసారి, నగరానికి దూరంగా యే వడవళని లోనో కుళాయిలూ, విద్యుద్దీపాలూ లేని రెండు గదుల్లో ఉంటూ- యిక్కడ, ధీరునికి మల్లే జనాన్ని అదుపులోపెడుతూ దర్జా వెలిగిస్తున్నాడు. నలగని సూటు, నిగనిగలాడే నల్లనిజుట్టు, చుట్టూ లక్షాధికారులూ- అతను నిజంగానే గర్విస్తున్నట్టున్నాడు- కొద్దిఘడియల్లో అక్కడున్న విలువైన వస్తువులన్నిటినీ ఒక్క సుత్తిదెబ్బతో రూపాయలుగా మార్చేఅధికారాన్ని చెలాయిస్తున్నందుకు. చేతుల్లో బంతులు పెట్టుకొని, వాటిని తమాషాగా యెగురవేస్తూ, ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందే గారడీవానికి మల్లే యితను, అక్కడున్న మనుషులు యిటునుంచీ అటునుంచీ, యెదుటినుంచీ వెనకనుంచీ విసురుతున్న మాటల్ని చురుగ్గా పట్టుకుంటూ, ''ఆరువందలు,'' ''ఆరువందల అయిదు'', ''ఆరువందల పది'' అంటూ ఆ పదాలనే తిరిగి చమత్కారంగా వారిమీదికే విసురుతున్నాడు.

ఓ క్షణంసేపు కనక పాటలో చురుకు తగ్గిందంటే, అతను వెంటనే అందుకుని ఉత్సాహ జనకంగా ''యీ కుడిపక్క నెవరూలేరూ ?'', ''అటు యెడమపక్కకూడా యెవరులేరూ?'' అంటూ కనుబొమ్మలు పైకెత్తి,కంఠంలో ఆశ్చర్యం ఉట్టిపడేటట్టు ప్రశ్నిస్తూ, ఆఖరుమనిషి పాడినదాంతో పాట ఆపేస్తున్నట్లూ, వస్తువు అమ్ముడైపోతున్నట్లూ సూచిస్తూ చేతిలోని సుత్తిని బల్లమీద పెట్టబోతూ, మళ్ళీ మరొక్కసారి నలుగురి వైపూచూసి చిరునవ్వు నవ్వుతూ, ''ఇదేమిటండీ, అసలుమీరు పాట సరిగ్గా పాడందే !..అద్భుతమైన యీ వస్తువువెల ఆరువందల పదేనా ! అబ్బే....'' అంటూ ప్రోత్సాహ పరుస్తున్నాడు. మధ్యమధ్య, అప్పుడే హాజరైన వారికి స్వాగతంచెబుతూ, పాట పెంచగల పెద్దమనుషులవైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. ఏదైనా కొత్తవస్తువును అమ్మకానికి పెడుతున్నప్పుడు... ''యిదుగోనండీ ! యిది అన్నిటికన్న ముఖ్యమైనది — ముప్ఫయిమూడోదండి !'' అంటూ నలుగురి దృష్టినీ ఆకర్షించేలా చెప్పటం ప్రారంభిస్తాడు. పాట అతనికి సంతృప్తి కలిగించేవరకూ పెరిగినప్పుడు అతని గంభీరకంఠం మరెంత మృదుమధుర మవుతున్నది. కొన్నిగంటలసేపు వరసగా, నాలుగైదు వందలమంది విసురు తూన్న పదాలు అతనిపెదవులపైన దొర్లుతూ, అతని చేతిలోని దంతపుసుత్తి కదలికను అత్యంత శ్రద్ధాసక్తులతో ప్రేక్షకులు పరిశీలిస్తుంటే, అతనికి నిజంగా

తృప్తికలుగుతున్నది. నిజానికి, పాటపెరగటం అప్రయత్నంగా జరుగుతున్నప్పటికీ, తను నిర్వహించే పాత్ర అతిముఖ్యమైనదనే భావం అతనికి సంతృప్తి కలుగజేస్తున్నది. అతని కంఠ విన్యాసం, పురివిప్పినాట్యంచేసే నెమలిని గుర్తుకి తెస్తున్నది. కాని, సాయంకాలం నేను చూసినదాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటే, అక్కడిదుకాణంలో కిటికీదగ్గరకూర్చుని తమ వికారచేష్టలతో జనాన్ని ఆకర్షించి తద్వారా నా జేబుదొంగకి అవకాశంయిచ్చిన కోతులూ, యీ వేలంవేసే అతనూ ఒకే స్థితిలో ఉన్నారనిపిస్తోంది.

ఆ విధంగా అనుకోకుండా కలిసివచ్చినా, ప్రస్తుతానికి మాత్రం నా మిత్రుడికేమీ లాభంలేకపోయింది. గుమ్మంలోఉన్న గుంపులో యిద్దరం యిరుక్కుపోయాం. ఇక వాళ్లల్లోంచి దారిచేసుకుని ఆ వేలంవేసే వస్తువులను సమీపించటానికి అవకాశమేలేదు. అయితే, యీ లలితకళలో నేనింకా ప్రావీణ్యాన్ని పొందలేదన్నసంగతి మరోసారి సుస్పష్టమైంది. నా మిత్రుడు ప్రవీణుడు కాబట్టి, వేలంపాడే అతనిచేతిలో సుత్తి బల్లపైన పడగానే (సరిగ్గా అప్పుడేఅతను 'ఏడువందల అరవైరూపాయలకు వెళిపోయింది'అంటున్నాడు) గుండెల్ని బిగపట్టే ఉద్రిక్తత సడలిపోయింది. ఎత్తినతలలు యథాస్థానంలో కొచ్చాయి. వేలంవేస్తున్న వాళ్లు కేటలాగులో ధరలు వ్రాసుకుంటున్నారు. విసుగుపుట్టినవాళ్లు వెళ్ళిపోతున్నారు. మంచుప్రదేశంలో బీటలుపడినట్లుగా జనసమర్దంలో మధ్యమధ్య ఖాళీలేర్పడుతున్నాయి. ఆ అవకాశాన్ని వెంటనే అందుకున్నాడు మన జేబుదొంగ. ధైర్యంగా ముందుకు చొచ్చుకొని మూడు నాలుగు వరసలు దాటిపోయాడు. అతనిదోవని ఆతన్ని విడిచిపెట్టకూడదని ఒట్టుపెట్టుకున్న నేను, గుమ్మం యివతలే ఒంటరిగా మిగిలిపోయాను.

నేనూ లోపలికి దూరటానికి ప్రయత్నించాను. కాని యీలోపునే వేలంవేసే అతను యేదో కొత్తవస్తువు గురించి చమత్కారంగా చెప్పటం ప్రారంభించాడు. బీటలు మూసుకుపోయినై. నిస్సహాయంగా గుంపులో యిరుక్కుపోయాను, ఇటూ అటూ ముందూవెనకా, జనం హొత్తడియెంత వివరీతంగా ఉందంటే, నా వక్కనున్నాయన దగ్గినదగ్గుకి నాఆపాదమస్తకం ఒక్కసారి అదిరిపోయింది. ప్రసరిస్తున్న గాలికూడా దుర్గంధంతో, ధూళితో నిండిపోయింది. ఒకరి ఊపిరి ఒకరు పీలుస్తున్నారు. చమటకంపు దుర్భరంగా ఉంది. (ప్రజలుడబ్బుకోసం తాపత్రయపడే ప్రతిచోటాయింతే). నా మిత్రుడు

నేను చమటతో తడిసి ముద్దయి పోయాను. వేస్టుకోటు బొత్తాములు విప్పుకుని లోపలజేబులో పర్సు జాగ్రత్తగా ఉందోలేదో చూసుకుందా మనుకున్నాను. ఈ లోపల యెలాగో మొండిగా రెండు మూడు వరసలు తోసుకుని ముందుకి వెళ్లాను. కాని, లాభం లేకపోయింది. అప్పటికే కాకీచొక్కావాడు మాయమై పోయాడు. కాని ఆ గదిలోనే యెక్కడో ఓ చోటఉండి తీరతాడు. అతనక్కడ ఉన్నాడనే భీకరసత్యం నా కొక్కడికే తెలుసును. ఇవాళ అసలే అతనికి మంచిరోజుకాదు. అతనెక్కడ పట్టుబడిపోతాడోననే ఆదుర్దాతో నా నరాలన్నీ బిగుసుకుపోయినై. ఎవరిజేబులోనైనా చెయ్యిపెట్టగా యెక్కడ పట్టుబడి పోతాడో, యెప్పుడు "దొంగ...దొంగ" అనే అరుపు నా పాపిష్టిచెవులకు వినిపిస్తుందో, యెక్కడ పోలీసుల్ని పిలుచుకొస్తారోనని క్షణక్షణం నా గుండె బెదిరిపోతున్నది. ఆ నాడే అతనికేదో దురదృష్టంపట్టి తీరుతుందనే నమ్మకం నా కెలా కలిగిందో నాకే తెలియదు. బహుశా అతని నుదుటిమీద వ్రాసి వుందేమో.

కాని, అటువంటిదేమీ సంభవించలేదు. ఎవ్వరూ "దొంగ....దొంగ" అని అరవలేదు. ఆ అరుపులకి బదులు, హఠాత్తుగా నిశ్శబ్దత యేర్పడింది- అక్కడున్న రెండు మూడువందలమందీ ఒక్కసారిగా ఊపిరిబిగపెట్టినట్లు, అంతా తదేక దృష్టితో, అత్యంత శ్రద్ధతో వేలంవేసే వాడివైపు చూస్తున్నారు. అతను ఒకటి రెండడుగులు వెనక్కివేశాడు. అప్పుడు విద్యుద్దీపకాంతి అతని ముఖంమీదపడి తళుక్కుమంది. కారణంగ్రహించాను. అక్కడున్న సామానంతటిలోకీ అతి ముఖ్యమైన వస్తువునితీసి యిప్పుడు అమ్మకానికి పెడుతున్నాడు. అది,చైనాదేశంనుంచి హిందూదేశానికి వచ్చిన బౌద్ధభిక్షుకులు అశోకచక్రవర్తికి బహూకరించిన బంగారు బుద్ధవిగ్రహం. అదెలాగో నేపాలు దేశపురాజు ఆ స్థానానికిచేరి అక్కడ కొన్నాళ్లుండి, కాలక్రమేణా తిరిగి తిరిగి చెన్నపురికి చేరుకుంది. ఇప్పుడీ వేలంవేసేచోట దాన్ని అపురూపంగా యెంచి దానికి విలువకడుతున్నారు. అది రెండున్నర అడుగుల విగ్రహము. ఇద్దరు మనుషులు దాన్ని మోసుకొచ్చి జాగ్రత్తగా బల్లమీద పెట్టారు. ధన మదాంధకారంలోపడి కొట్టుకుంటున్న జనానికి విజ్ఞానదీప్తిని ప్రసాదిస్తున్నట్లుగా ఉన్నదా బుద్ధవిగ్రహం, వేలంవేసే

అతను గొంతుక సర్దుకుని చెప్పటం ప్రారంభించాడు. ఈ విగ్రహం వెలముందే నిర్ణయింపబడిందనీ, పాట మూడువేల అయిదువందలకు పైనే పాడవలసి వుంటుందనీ చెప్పాడు. అథమం మూడువేల అయిదువందలు! అంత అంకె వినేసరికి అందరిమనస్సుల్లో ఆలోచనలురేగి, ఆ విగ్రహంపైన ఒక విధమైన పూజ్యభావం యేర్పడింది. పాట పాడటానికి కాని, ఒక్క అడుగు ముందుకి వెయ్యటానికి కాని, ఒక్కముక్క మాట్లాడటానికి కాని, యే వొక్కరూ సాహసించలేదు. ఆఖరుకి, యెడంవైపు కూర్చున్న – బాగా తలసెరిసిన వండుముదుసలి ఒకాయన తలపైకెత్తి మెల్లిగా ''మూడువేల ఆరువందలు'' అనిగొణిగాడు. అదివిని వెంటనే కుడివైపునకూర్చున్న బట్టతలాయన లేచి ''మూడువేల యెనిమిదివందలు'' అన్నాడు. అదివిని ఓ లక్షాధికారి బుగ్గ మీసాలు మెలివేస్తూ ''నాలుగువేలు'' అన్నాడు బొంగురు గొంతుతో. పాట కాస్సేపు అలాగే నిలబడిపోయింది. ఆ తరవాత, అందరికన్నా ముందర వరసలో కూర్చున్న విదేశీయు డొకాయన కనుబొమ్మలు పైకెత్తి చేతివేళ్లతో యేదో సంజ్ఞచేశాడు. ఆయనపక్కనే నుంచున్న సెక్రటరీ ఆ సూచనను గట్టిగా మాటల్లోచెప్పాడు. ఆ సెక్రటరీపేరు అక్కడున్న వాళ్లంతా గుస గుసలాడుతున్నారు. ''నాలుగువేల అయిదువందలు''. దాంతో, బుగ్గ మీసాలాయనకి తల కొట్టేసినట్లయింది. అయినా, పౌరుషాన్ని నిలబెట్టుకోవాలని మరోవంద హెచ్చించాడు. విదేశస్థుడుకూడా ఊరుకోలేదు. పాటవీరిద్దరి మధ్య సాగుతున్నది. పట్టుదలగా యిద్దరూ పాడుతున్నారు. ఒకరిముఖాన్నొకరు చూసుకోకుండా, యిద్దరూ తమదృష్టిని వేలంవేసే అతనివైపు కేంద్రీకరించారు. వేలంవేసే అతను వీరినుండి వారివైపూ, వారినుండి వీరివైపూ సందిగ్ధంగా చూపులు మళ్లిస్తున్నాడు. ఆఖరుకి విదేశీయుని సెక్రటరీ ధీమాగా ''అయిదువేలు'' అన్నాడు. బుగ్గమీసాలు మెలికలు తిరిగిపోయి మండి పోతున్నాయి. ఏదోపట్టుదలకోసం, బంగారంకదా అని యింతదూరంవచ్చాడు. కాని, ఆ బుద్ధవిగ్రహాన్ని తనేంచేసుకుంటాడు! ఇంక ఊరుకున్నాడు. ''అయిదువేలు'' గాలిలోవ్రేలాడుతూ గడ్డకట్టుడు పోతున్నది. అత్యాధికమవుతున్న ఉత్సాహంతో వేలంవేసే అతను నాలుగుసార్లు అరచాడు... ''అయిదువేలు... వెళ్ళిపోతోంది'' అంటూ. కొంతసేపాగి, యింకాయెవరైనా హెచ్చిస్తారేమోననే ఆశతో ''యింకెవరూ పాడరా?'' అన్నాడు.

నిశ్శబ్దం, మళ్ళీ ''యింకెవరూ పాడరూ ?'' ఆ మాటలు గాలిలో తేలిపోయాయి. ధ్వని తేవటానికి ప్రయత్నించే తీగెలాగ నిశ్శబ్దం కంపిస్తున్నది. వేలంవేసే అతను సుత్తి పైకెత్తాడు. సుమారు మూడువందలమంది గుండెలు ఆగిపోయినంతపనైంది. ''అయిదు వేలకు వెళ్ళిపోతోంది'' అని మళ్లీ మూడు సార్లన్నాడు. అంతా ఊపిరిబిగపట్టుకు నిల్చున్నారు. ఆ దంతపుసుత్తి యింకా పైకిలేచింది. ''వెళ్ళిపోతోంది'' అన్నాడా వేలంవేసే అతను. సమాధానంలేదు. ''వెళ్ళిపోతోంది'' సమాధానం లేదు. బల్లమీద టక్కుమంది సుత్తి. ఆ వెనువెంటనే ''వెళ్ళిపోయింది'' అని వినిపించింది. ఆ వ్యవహారం పరిష్కారమైపోయింది.

అయిదువేల రూపాయలు ! గోడకట్టుకు పోయిన ప్రేక్షకులంతా చిన్న చిన్న సజీవ మానవస్వరూపాలుగా విడిపోయారు. పెద్ద సందడి.. అంతా గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.. గొంతుకలు సర్దుకున్నారు. అంతా కలిసి ఒక్క ఊపున ఒకరినొకరు తోసుకుంటూ వెనక్కొచ్చేశారు.

ఎవడో కొత్తమనిషిమో చేతితోపు నాకూ తగిలింది. దాంతోబాటే ఎవరో ''క్షమించండి'' అని గొణిగారు. నేను కొయ్యబారిపొయ్యాను. అదేకంఠం! అవును, అతనే. అదృష్టవశాత్తు ఆ గుంపంతా నా పక్కనుంచే తోసుకు పోయింది ముందుకి. అతను నా దృష్టిపథంనుంచి తప్పించుకున్నాక మొదటి సారి అతను నా పక్కన ఉన్నాడు. తిరిగి నేనతన్ని కనిపెడుతూవుండి, అతనికి రక్షణ యివ్వచ్చును. అయితే, ఆతని కళ్లల్లోకి సూటిగా మాత్రం చూళ్లేదు. చాటుగా అతని చేతులవైపు, అతనుపయోగించిన పనిముట్లవైపు చూశాను- కాని అవి అక్కడ లేవు ! అతని చొక్కాచేతులు రెండూ క్రిందికి వ్రేలాడుతున్నాయి. చలివేస్తున్నట్టు, గుప్పిళ్లు రెండింటినీ లోపలికి ముడిచి పెట్టేసుకున్నాడు. ఒకవేళ ఇప్పుడు ఎవరిజేబైనా కత్తిరించ దలుచుకున్నప్పటికీ, యెదుటివాడికి మాత్రం అమాయకంగా కనిపించే చొక్కాచేతులే తగుల్తాయి కాని, అందులోదాక్కున్న జేబుదొంగ భీకరహస్తాలుమాత్రం కంట పడవు- పిల్లి పంజాకుండే గోళ్లకుమల్లే. భలే ఉపాయం ! అయితే యింతకీ తన విద్యను ఎవరిమీద ప్రయోగిస్తాడు ? నేను అతిజాగ్రత్తగా అతని కుడివైపుకి చూశాను. అక్కడ ఒక బక్కపలచటి మనిషి నిలుచుని వున్నాడు. కోటుబొత్తాలన్నీ బిగించేవున్నాయి. ఆయన ముందర, ధృఢంగా కనిపిస్తున్న

మీరు నన్ను గుర్తించనేలేదు. రెండురోజులు పోయాక, తిరిగి మనం యెదురుపడినప్పుడు చనువుగా నాకేసి చూశారు మీరు. కాని ఆ చూపులోని అంతర్యం మీరు స్త్రీత్వాన్ని మేల్కొల్పిన బాలికను- మిమ్మల్ని ప్రేమించిన బాలికను గుర్తించారని కాదు. ఊరికే, రెండురోజుల క్రితం ఆదేస్థలంలో ఆ అందమైన పద్దెనిమిదేళ్ల అమ్మాయిని చూసినట్లు గుర్తుకొచ్చింది- అంతే. స్నేహపూర్వకంగా సంభ్రమాన్ని వ్యక్తపరచింది మీ చూపు. చిన్న చిరు నవ్వు చిందులు త్రొక్కింది మీ అధరాలపైన. ఇదివరకులాగే మీరు నన్ను దాటిపోయారు. ఇదివరకులాగే నడకలో చురుకు తగ్గించారు. నా ఆపాద మస్తకం ఆనందంతో కంపించిపోయింది. మీరు నన్ను పలుకరించాలని నా హృదయం తహతహలాడింది. ప్రప్రథమంగా మీ మనస్సులో ప్రవేశించా నన్న భావం కలిగింది నాలో. నేను కూడా నెమ్మదిగా నడకసాగించాను. మిమ్మల్ని తప్పుకోవటానికి ప్రయత్నించలేదు. హఠాత్తుగా మీ అడుగులసవ్వడి నా వెనకనుంచి వినిపించింది. వెనక్కి తిరిగి చూడకుండానే, మరుక్షణంలో మీ మృదుమధుర కంఠం నన్ను ఆప్యాయంగా సంబోధిస్తుందని గ్రహించాను. ఆ తలపురాగానే నా ఒంట్లోని రక్తమంతా గడ్డకట్టుకుపోయినట్లయింది. నా గుండె తీవ్రంగా కొట్టుకుంది. నడవటం అసాధ్యమనిపించింది. అంతలోకే మీరు నాప్రక్క నిలిచారు. స్నేహపూర్వకంగా, చిరకాలపరిచితునికి మల్లే నన్ను పలుకరించారు- నిజానికి నేనెవరో మీకు తెలియకపోయినా, నా జీవితం గురించి కించిత్తు కూడా తెలుసుకోకపోయినా, మీ ప్రవర్తన యెంత సరళంగా ముచ్చటగా ఉన్నదంటే, మీరడిగినదానికి సంకోచంలేకుండా సమాధానం చెప్పగలిగాను. ఆ వీధమ్మట కొంతదూరం నడిచాం. దారిలో మీరు ఆ రాత్రికి మీతో భోజనం చెయ్యటానికి నాకు వీలుంటుందా - అని అడిగారు. నేను సమ్మతించాను. మీరు కోరితే నేను దేన్ని కాదనగలను ?

ఏదో చిన్న హోటలులో ఆ రాత్రి భోంచేశాం. అదెక్కడున్నదో మీకు జ్ఞాపకంవుండదు. మీకైతే లక్షవాటిల్లో అదొకటి. నా మాట మాత్రం యేమిటి ? వందలమందిలో నేనొకర్తెను... యిదొక అనుభవం ... అనంత హారంలో యిదొక చిన్న గొలుసు. మీరు జ్ఞాపకం పెట్టుకోవటానికి ఆ రాత్రి యేంజరిగింది ? నేను అట్టే మాట్లాడలేదు. మీరు నా దగ్గరుండి, నాతో సంభాషిస్తూంటే నాకెంతహాయిగా ఉందప్పుడు ? అనవసర ప్రశ్నలు వేసి

గాని, వెర్రిగా మాట్లాడిగాని ఒక్క క్షణం కూడా వృథా పోనివ్వదలుచుకోలేదు నేను. నా ప్రస్తుతికి తగినట్లుగా ప్రవర్తిస్తూ ఆ గంటసేపు నాతో గడిపినందుకు మీకు ఆజన్మాంతం కృతజ్ఞురాలిని. మీ సరళస్వభావాన్ని నేనెన్నటికీ మరిచిపోలేను. అనవసరంగా ఆత్రుత ప్రకటించకుండా, కంగారుపడి చొరవచేసుకోకుండా మీరు నన్ను లాలించారు. అంతక్రితం యేనాడో మీకు నా సర్వస్వాన్నీ సమర్పించకపోయినప్పటికి, ఆ క్షణంలోనైనా నన్ను మీదాన్ని చేసుకోగలిగినంత విశ్వసనీయంగా వాత్సల్యాన్ని ప్రకటించారు ఆరంభంనుంచీ. నా అయిదు సంవత్సరాల దీర్ఘనిరీక్షణ పరిపూర్ణంగా సఫలమైనదంటే నాకప్పుడెలా ఉన్నదో యేమని చెప్పను?

గంటసేపయాక ఆలస్యమైపోతుందని బయటికి వచ్చేశాం. వీధిగుమ్మం దగ్గర ఆగి, నేనేమన్నా పనిహడావిడిలో వున్నానా, లేక యింకా కొంతసేపు మీతో గడపటానికి అభ్యంతరం యేమన్నా ఉందా అని అడిగారు. నేను మీదాన్నేనన్న సత్యాన్ని మీకు తెలియకుండా యెలా దాచగలను? నాకేమీ పనిలేదన్నాను. క్షణం సంకోచించి, ఓసారి మీ యింటికి రాకూడదా, మాట్లాడుకోవచ్చునన్నారు. "ఓ, తప్పకుండా" అన్నాను సంభ్రమంతో నా మనస్సులోని భావాలను స్పష్టంగా వ్యక్తపరుస్తూ. నేను అంత వెంటనే మీరడిగినదానికి ఒప్పుకునేసరికి మీరు ఆశ్చర్యపోవటం నేను గమనించక పోలేదు అందుకు మీరు విసుక్కున్నారో లేక సంతోషించారో నాకు సరిగ్గా తెలియదుకాని, మీరు ఆశ్చర్యపోయారన్నది మాత్రం వాస్తవం. మీ ఆశ్చర్యానికి కారణం యీనాడు నాకు తెలుసు. సాధారణంగా ఆడది మనస్సులో పురుష సంపర్కాన్ని యెంతతీవ్రంగా వాంఛిస్తున్నా, పైకిమాత్రం ముభావంగా వుండి, మొదట కాస్త బెట్టుచూపించి, తిరస్కరించి, ఎదుటవారి ఆసక్తిని మరింత అధికంచెయ్యటం సహజం. ఎన్నోవిధాల బ్రతిమాలి, అబద్ధాలాడి, ఆశలురేపి, ప్రమాణాలుచేసి, నానాతంటాలుపడి ఆ మెను వొప్పించవలసి వస్తుంది. సాధారణంగా వేశ్యావృత్తి నవలంభించినవాళ్లే అంత సులభంగా స్పష్టంగా ఒప్పుకుంటారు- అది వేశ్యలకూ, తెలిసీ తెలియని పిల్లలకూ మాత్రమే సాధ్యమవుతుంది. కాని, నా విషయంలో ఆ విస్పష్టసమ్మతి ప్రబలవాంఛా ప్రేరితమనీ, వెయ్యిదినాల దీర్ఘపరితాప ప్రభావమనీ మీరెలా తెలుసుకోగలరు?

ఏదెలావున్నా, నా ప్రవర్తన మిమ్మల్ని ఆకర్షించింది. మీ దృష్టిలో నేను తమాషాగా కనిపించాను. మనిద్దరం కలిసి నడుస్తూ పోతూండగా మన సంభాషణలో మధ్యమధ్య నాతత్వం యెలాంటిదో తెలుసుకోవటానికి ఒకటి రెండుసార్లు కదిపిచూశారు. మానవతత్వాన్ని గురించి మీకు తెలిసినదాని బట్టి చూస్తే నేను మీకంటికి అసామాన్యంగా కనిపించాను- యీ చక్కని చుక్క మనస్సులో యేదో రహస్యం దాచుకుంటోందనుకున్నారు. మీలో కుతూహలం రేగింది. మీ యుక్తిప్రశ్నలు చూస్తే నా రహస్యాన్ని బయటకి లాగటానికి ప్రయత్నిస్తున్నారని తెలిసిపోయింది. అందుకు తగినట్లుగా నేను కూడా తప్పించుకుంటూ చమత్కారంగా సమాధానాలిచ్చాను. ఆవిధంగా మూర్ఖత్వాన్నైనా ప్రదర్శించానుగాని నా రహస్యాన్ని మాత్రం మీకు చెప్ప లేదు.

మీయింటికి చేరుకున్నాం. ఆమేడమెట్లు మీతో కలిసి ఎక్కడమంటే నాకెలా వుంటుందో చెప్పినా మీకర్థంకాదండీ.... అలా అంటున్నందుకు క్షమించండి— పిచ్చెత్తిపోయి, వెర్రిసంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపో యాను. ఇప్పటికి కూడా ఆ విషయాన్ని తలుచుకుంటే కళ్లమ్మట నీరు రాకమానదు- కాని నా కన్నులలో నీరు నిండుకున్నది. ఆ యింట్లో ప్రతీదీ నాకు ప్రేమాస్పదమే. అక్కడున్న ప్రతీదీ నా బాల్యావస్థకూ, అప్పటి వాంఛలకూ చిహ్నం. అక్కడున్న తలుపువెనక నుంచుని యెన్నివేలసార్లు మీరాకకోసం యెదురుచూశాను; మేడమెట్లమీద మీ పదధ్వని వినేదాన్ని.... అక్కడే మిమ్మల్ని మొట్టమొదట చూశాను.... మీ రాకపోకలనూ, మీ చర్యలనూ కనిపెట్టిచూస్తూ వుండేదాన్ని. ఆ తలుపుకుండే దొంగకన్నం లోంచి... అక్కడున్న కాళ్లుతుడుచుకునే కొబ్బరిపీచుమీద ఒకసారి మోక రిల్లాను.... తలుపుతాళం తీస్తున్నధ్వని నాకు బాగా ఆనవాలే- అదే మీ రాకను సూచించేది. ఈ కొద్దిగజాల స్థలంలోనే నా చిన్నతనం, అప్పటి ఆశలూ గూడుకట్టుకున్నాయి. నా జీవితమంతా యిక్కడే వుండేది. మహా ప్రళయంలా నాలో ఉద్రేకం చెలరేగింది. నా ఆశలన్నీ ఫలించబోతున్నాయి. నేను మీతో కలిసి- మీ— మనయింటికి వెడుతున్నాం. మీ గదితలుపు వరకూ (నేను ప్రయోగిస్తున్నమాటలు నిస్సారంగా తోచవచ్చు మీకు- కాని

నాకంతకంటె మంచిమాటలు దొరకటం లేదు) వాస్తవిక ప్రపంచం- నా గతజీవితంలో నేను నివశించిన నిస్సార దైనందినలోకం యిది.... ఈ తలుపు కవతల అంతా మాయలోకం- నేను చిన్నతనంలో సృష్టించుకున్న ఊహా లోకం- అలాడీన్ ఆవరణ! ఎన్నివేలసార్లు ఆతలుపుకేసి కళ్లు అప్పగించి చూశానో, ఆతలుపు తెరుచుకొని లోపలికి ప్రవేశిస్తుంటే- ఆ క్షణంలో నాకెలా వుంటుందో ఒక్కసారి ఊహించండి.

ఆ రాత్రంతా మీతోనే గడిపాను. మీకంటెముందుగా ఏపురుషుడూ నన్నూ నా శరీరాన్నీ స్పృశించలేదని, అధమం చూడనైనాలేదని మీరు కలలోనైనా ఊహించుకొని వుండరు. అయినా మీరెలా ఊహించుకుంటారు. నేను సిగ్గు, భిడియం పూర్తిగా వొదిలేసి, యెక్కడ నా ప్రేమరహస్యం వెల్లడై పోతుందోనని భయపడి మీకు కించిత్తు అభ్యంతరం చెప్పకుండా లొంగి పోయినప్పుడు ? అలాజరిగితే మీరెంత కంగారుపడిపోయి వుండేవారు- మీరెప్పుడూ ఆషామాషీగా జరిగిపోయే వాటితోనే,తేలిగ్గా తేల్చిపారేసేవిషయా లతోనే వ్యవహర్తిస్తారు. ఇతరుల జీవితాల్లో జోక్యం కలిగించుకోవటం మీకు తగని భయం. ఇష్టంవచ్చినట్లు మిమ్మల్ని మీరు లోకానికి ధారపోసు కుంటారు. కాని, దేన్నీ త్యాగంచెయ్యలేరు. ఇప్పుడు నేను నా కన్యాత్వాన్ని మీకు ధారపోశానంటే మీరు అపార్థం చేసుకోకండి. మీమీద నేనేమీ నిందమోపటం లేదు. మీరు నన్నేమీ మభ్యపెట్టలేదు, మోసగించలేదు, నా మానం చెడగొట్టలేదు. నేనే మీ వొడిలో వ్రాలిపోయాను ... నా విధికి నేనే యెదురువెళ్లాను. ఆరాత్రి సౌఖ్యానికి మీపై కృతజ్ఞతాభావం తప్ప మరొకటిలేదు. ఆరాత్రి చీకటిలో కళ్లుతెరిచినప్పుడు మీరు నా పక్కనే పడుకొని నిద్రపోతున్నారు. అప్పుడు నాకు స్వర్గంలో వున్నట్లనిపించింది. నా నక్షత్రం మంచిదికాదు. ఆరాత్రి మీకు నా సర్వస్వాన్నీ సమర్పించి నందుకు నేనెప్పుడూ చింతించలేదు. మీరు నా పక్కలో పడుకొని నిద్ర పోతుంటే, మీరు ఊపిరిపీలుస్తుంటే వింటూ, మీదేహాన్ని స్పృశించాను.... మీ సామీప్యత సిద్ధించినందుకు ఆనందం పట్టలేకపోయాను. నా కన్నుల్లో ఆనందబాష్పాలు !

తెల్లవారు తూండగానే లేచి వెళ్ళిపోయాను. ఆఫీసుకి వెళ్ళాలి, అది కాకుండా నౌకరువచ్చేలోగానే వెళ్ళిపోవాలని నా ఉద్దేశం. నేను వెళ్ళటానికి

సిద్ధమవుతూంటే మీరు మీ చేత్తో నన్ను దగ్గరగా లాక్కుని నా కళ్లవైపు చాలాసేపు చూశారు. ఎప్పటిదో యేదైనా సంగతి గుర్తుకొస్తున్నదా, లేక, నేననుభవించిన ఉజ్జ్వల సౌఖ్యం నాలోని అందాన్ని విరజిమ్ముతున్నదా? నా అధరాలను ముద్దుపెట్టుకున్నారు. నేను వెళ్లటానికి సిద్ధమైయాను.

"నీతో కాసిని పువ్వులేమైనా పట్టుకెళ్లవూ?" అని అడిగారు. అక్కడున్న వ్రాతబల్లమీద గాజు కూజాలో నాలుగు తెల్ల గులాబీపువ్వులున్నాయి. (ఆరోజున వాటివైపే దొంగచూపు చూశాను) వాటిని నా చేతికిచ్చారు. వాటి మీద యెన్నిముద్దులు కురిపించానో.

ఆ మర్నాడు సాయంకాలం కలుసుకోవటానికి యేర్పాటు చేసుకున్నాం. అప్పుడుకూడా మన సమాగమం సంభ్రమాశ్చర్యాలతో కూడినదే. మూడవ రాత్రికికూడా అవకాశం యిచ్చారు. అప్పుడే చెప్పారు—మీరు కొన్నాళ్ల పాటు యీ ఊళ్లో ఉండటం లేదని. అబ్బ! మీ ప్రయాణాలంటే నాకు పరమ అసహ్యం! రాగానే నాకు ఉత్తరంద్వారా కబురుచేస్తానని ఒట్టువేశారు. నా తపాలా ఎడ్రసుమాత్రమే యిచ్చాను మీకు. నా అసలుపేరు కూడా చెప్పలేదు. నా రహస్యాన్ని భద్రంగా దాచుకున్నాను. వెళిపోయేటప్పుడు మళ్ళీ పువ్వులిచ్చారు— వెళ్ళిపోయేటప్పుడే.

రోజు రోజూ రెండు నెల్లపాటు నన్ను నే నే ప్రశ్నించుకునేదాన్ని.... ఉహుఁ, నా విరహవేదనను వర్ణించను... ఫిర్యాదుచెయ్యను.... మీరు ఉద్రిక్త స్వభావులైనా, మందమతులైనా, విశ్వాసఘాతకులైనా, దయామయులైనా మిమ్మల్ని నేను ప్రేమిస్తాను. మీరు ఉన్న స్థితిలోనే మిమ్మల్ని ప్రేమిస్తాను. రెండునెలలు అయాక తిరిగివచ్చారు. అదైనా మీ కిటికీ దగ్గర దీపంచూసి గ్రహించుకున్నాను. నా కోసం కబురుపెట్టలేదు. ఒక ఉత్తరంముక్కయినా— ఒక్క ముక్కయినా వ్రాయలేదు...

నిన్న చనిపోయిన నా కొడుకుకూడా మీ వాడే. వాడు మీ కొడుకు— ఆ మూడు రాత్రులలో ఒకరాత్రి ఫలితం. నేను మీ దాన్ని— వాడు పుట్టేనాటి వరకూ మీ ఒక్కరిదాన్నే. మీ స్పర్శవల్ల నా దేహం పునీతమైనట్లు భావించాను. ఇక మరో మగవాడి సరసాలకు వశం కావటం సాధ్యంకాని పని. వాడు మన కొడుకండీ....నా మనఃపూర్వకప్రేమ, మీ రసికానురాగమూ మిళితమై వాడి జన్మకు కారణభూత మైనవి. మనబిడ్డ, మనకొడుకు, మన

యే కైక పుత్రుడు. మన కుర్రవాడి గురించి నేను మీ కెందుకు చెప్పలేదని ఆశ్చర్య పోతారేమో. ఇన్ని సంవత్సరాలు మౌనం వహించి, వాడిగురించి యిప్పుడు-వాడు దీర్ఘ నిద్రలో మునిగి నన్నిక శాశ్వతంగా వొదిలి వెళ్ళిపోయే సమయంలో మీకు వాణ్ని గురించి చెబుతున్నాను. ఇంతకుముందు మీ కెలా చెప్పగలిగి వుండేదాన్ని ? నేనొక అపరిచితను- ఆ మూడురాత్రులూ మీతో గడపాలని తహ తహ లాడిపోయిన ఒక కన్యను, ఏదో యధాలాపంగా వచ్చిన అవకాశంలో అనుభవించిన ఆడది మిమ్మల్ని విశ్వసించిందని- అవిశ్వసనీయులైన మిమ్మల్ని విశ్వసించిందని చెబితే మీరుచస్తే నమ్మేవారు కాదు. నానా హంగామాచేసిన మీదటగాని వాణ్ని మీ కొడుకేనని ఒప్పుకునే వారుకాదు. ఏదో పైకి ఒకవేళ నామాట నమ్మినట్లు కనిపించినా, అవకాశం దొరికిందికదా అని, మీరు భాగ్యవంతులుకదా అని, మరో ప్రియుడికి పుట్టిన బిడ్డను మీకు అంటగట్టానేమోనన్న అనుమానంలోపల మిమ్మల్ని అను నిత్యం వేధిస్తూనేవుండేది. మీరు తప్పక అనుమానించేవారు. మీకూ నాకూ మధ్యనిత్యం యేవో అపోహచ్ఛాయలు మెదులుతూనేవుండేవి. బహుశా మీ గురించి మీ కన్న నాకే యెక్కువగా తెలుసునేమో. మీ కెప్పుడూ జల్సాగా, ఖులాసాగా బాదరాబందీ లేకుండా ఉండటం యిష్టం. అదే ప్రేమ అనుకుంటారు. హఠాత్తుగా పితృభారం మీ పైన పడేసరికి మీ తత్వాని కెంతో విరుద్ధంగాతోచివుండేది. అకస్మాత్తుగా ఒక పసికందు జీవితానికి బాధ్యత వహించటం మాటలుకాదు. స్వేచ్ఛావాయువులే మీ జీవనాధారం తప్పకుండా నన్నొక బంధనగా భావించివుండేవారు. అంత రంగంలో, మనస్ఫూర్తిగా కాకపోయినా, నెత్తిమీదవచ్చి పడిందని నన్ను అసహ్యించుకునేవారు. బహుశా, యిప్పుడే... మళ్ళీ మరో గంటదాకానో, మరో క్షణకాలమో నేను భారంగా తోచవచ్చు... మీరు నన్ను అసహ్యించుకుని వుండొచ్చు, కాని నా జీవితాంతంవరకూ మీకు కష్టం కలిగించటంకాని, భారమనిపించటంకాని చెయ్యలేదనే నా గర్వం. ఆ భారమంతా నామీదనే పెట్టుకుంటానుకాని, మీకు మాత్రం నేను బాధ్యత అప్పచెప్పను. మీరు చనువుగా చేరదీసి లాలించి అనుభవించిన ఆడవారిలో నేనొకర్తెగా-ఉండటమే నా కోరిక. వారిపట్ల కృతజ్ఞతాభావంతోనైనా వారిని తలుచుకుంటారేమో. నిజానికి నాగురించిమాత్రం మీ రెప్పుడూ ఆలోచించనేలేదు. మీరు నన్ను విస్మరించారు,

మిమ్మల్ని నిందించటం లేదు. నన్ను నమ్మండి, నేను మీగురించి ఫిర్యాదు చెయ్యటం లేదు. బాధలో మునిగిపోయి నా కలం యేదైనా వ్రాస్తే యీసారికి నన్ను క్షమించండి. మీరు నన్ను క్షమించాలి- నా పిల్లవాడు- మన పిల్లవాడు మిణుకుమిణుకు మంటున్న నూనెదీపం వెలుతురులో చచ్చి పడివున్నాడు. ఈ బాధంతా నేనొక్కర్తినే అనుభవించాల్సి వచ్చినందుకు క్రోధం పట్టలేక పళ్లు పటపటలాడిస్తూ గుప్పిళ్లు బిగించి "హంతకుడా" అని తిట్టాను ఆ భగవంతుణ్ని. ఫిర్యాదుచేస్తున్నందుకు క్షమించండి. నాకు తెలుసు మీరు దయామయులనీ; సహాయం అర్థిస్తే తప్పక చేస్తారనీ తెలుసును. ఏమనిషి అయినా మీనుంచి కోరినదంతా రెండుచేతులా తీసుకో వచ్చు, అయితే ఒక్క విషయం మాత్రం ఒప్పుకోవాలి- మీ సానుభూతికి సంస్కారం లేదు. మిమ్మల్ని అడగాలి. సహాయాన్ని అపేక్షించినవారికే సహాయం చేస్తారు. కష్టాల్లో బాధల్లో వున్నవాళ్లు మీకు ప్రేమాస్పదులు కాదు, సుఖంగా వున్నవాళ్లు తప్ప. మీవంటివాళ్లు ఎంతదయామయులైనా, మీనుంచి యేదైనా అపేక్షించటం కష్టం- చాలాకష్టం. నా చిన్నతనంలో ఒకసారి నేను మా తలుపుకన్నంలోంచి చూస్తూండగా తలుపుతట్టి పిలిచిన ఒక ముష్టివాడికి యేదో యిచ్చి పంపించారు. వాడు యేదైనా నోరువిప్పి అడిగే లోపలే మీరు గబగబా వాడిచేతిలో పడేసి వాణ్ని వొదిలించుకున్నారు. మీ కంగారు, గాభరాచూస్తే ఆపీడ యెంతత్వరగా వొదిలిపోతే అంత మంచి దన్నట్లు ప్రవర్తిస్తున్నారని తోస్తుంది. వాడిముఖాన్ని చూడటమే మీకు విప రీతమైన భయమనుకుంటాను. మీరంత విసుగుతో భిడియంతో సహాయం చెయ్యటం నేనెప్పటికీ మరిచిపోలేను. కృతజ్ఞతా పూర్వకంగా చెప్పే పలు కులు వినటానికి కూడా మీకు విసుగే. అందువల్లనే యెన్నిచిక్కుల్లోవున్నా నేను మీ దగ్గరికి రాలేదు. నేను కోరినసహాయం తప్పక చేసేవారనీ, నా కొడుకు మీకూ కొడుకేననుకోవటానికి సందేహించినా నాకు తగిన సహాయం చేసేవారని నాకు బాగా తెలుసును. నాకు బోలెడు డబ్బుయిచ్చి, అన్ని సదుపాయాలూ సమకూర్చి వుండేవారు- మీ అసహనాన్ని కప్పిపుచ్చుతూ, మనస్సులో రహస్యంగా, యీ గొడవ ఎలా వొదుల్చుకోవడమా అని బాధ పడుతూ వుండేవారు. పుట్టబోయే పసికందుని ఏవిధంగానైనా వొదుల్చుకోమని సలహా యిచ్చేవారని కూడా నాకు గట్టినమ్మకం. అన్నిటికన్నా నేను భయ

పడినదిందుకోసమే- మీరు కోరినవన్నీ నేను చేస్తానని నాకు తెలుసుగా-అందు కని. నాబిడ్డ నా సర్వస్వమూను. మీబిడ్డ- మీరే పునర్జన్మించారు- కాని ఖులాసాగా జల్సాగా తిరిగే మీరుకాదు-అలా అయితే నా దగ్గరే ఉంచుకోవా లనే ఆశ పెట్టుకునేదాన్నే కాదు- మీరు నాస్వంతానికి, నా రక్తమాంసాలను, నా జీవితంలో అంతర్లీనమయేదాన్ని నాకు ప్రసాదించారు. ఆఖరుకెలాగో మిమ్మల్ని బంధించాను. మీ సజీవరక్తం నా నరనరాల్లోనూ ప్రసరించటం నేను స్పష్టంగా గ్రహించాను. మిమ్మల్ని పోషించి, లాలించి, ముద్దులుపెట్టు కోవచ్చు తనివితీరా. మీవల్ల నేను గర్భందాల్చానని తెలుసుకోగానే, అందుకే అందుకే అంత సంతోషించాను, అందుకే మీకా రహస్యాన్ని వెల్లడించలేదు. ఇకముందు మీరు నన్ను తప్పించుకోవటానికి వీల్లేదు- మీరు నాస్వంతం.

మొదటిరెండు మూడు మాసాలూ గడిచినంత సునాయాసంగా తక్కిన నెలలన్నీ గడిచాయను కోకండి. ఎన్ని కష్టాలతో యెన్ని బాధలతో గడిచాయో; యీ తుచ్ఛ మానవజాతిపైన రోత పుట్టింది. మా పినతండ్రి బంధువులు నా పరిస్థితి గమనించి, వెంటనే మా వాళ్లకు కబురుపెట్టి వుంటారు. డబ్బు పంపమని మా అమ్మకి కూడా వ్రాయలేదు. ఎలాగో ఆ సమయంవరకూ ఒంటినున్న నగలన్నీ అమ్మేసి కాలక్షేపంచేశాను. నా పురిటికి వారంరోజుల ముందర నా పది పదిహేను రూపాయలూ యెవరోయెత్తుకుపోయారు. ధర్మాసు పత్రికి వెళ్ళవలసి వచ్చింది. పిల్లాడు- మీకొడుకు అక్కడ అసుపత్రిలో, ఆ నరకంలో, దారిద్ర్యంలో దిక్కులేకుండా లోకచ్యుతుడుగా జన్మించాడు. అది భయంకరమైన ప్రదేశం. అక్కడ ప్రతీదీ అపరిచితంగా అనురాగ రహితంగా కనిపించింది. ఒకరికీ మరొకరికీ మధ్య అనురాగంలేదు. ఒకరిపైన మరొకరికి అసహ్యం. మా మధ్య ఒక్కటే బాంధవ్యం- మా అందరినీ దరికి చేర్చినది దారిద్ర్యమూ, వ్యధ. ఆ ప్రదేశమంతా జనంతో కిక్కిరిసిపోయి, మత్తుమందు వాసనతో, రక్తగంధంతో, ఏడుపులతో మూలు గులతో నిండి దుర్భరంగాఉంది. ఈ స్థలంలో పడ్డరోగి వ్యక్తిత్వాన్ని కోల్పోతుంది- ఆ వ్యక్తిపేరు మాత్రం ఆసుపత్రి చిట్టా పుస్తకంలో ఉండి పోతుంది. ఆ పక్కమీద ఉన్నది కంపించిపోయే మాసంముద్ద- పరిశోధించ వలసిన పథార్థం....

ఇటువంటి విషయాలన్నీ మీతో చెబుతున్నందుకు క్షమించమని వేడు

కుంటున్నాను. ఇంకెప్పుడూ యిటువంటివి మీతో చెప్పను. పదకొండు సంవత్సరాలు మౌనం వహించాను-ఇక త్వరలోనే శాశ్వతంగా మూగదాన్నై పోతాను. ఒక్కసారైనా తనివితీరా గట్టిగా యేడవనివ్వండి.... యెంత కష్టపడి యింత విలువైన బిడ్డను పొందానో — నన్నొకప్పుడు ఆనంద సాగరం లో ముంచివేసి యిప్పుడిక్కడ చచ్చిపడివున్న నా కొడుకుగురించి మీతోచెప్ప నివ్వండి. ఆ భయంకర దినాలను వాడిబోసి నవ్వులు, వాడి మధురకంఠ స్వరం మరిపించేవి. వాడివల్ల పొందిన ఆనందంలో గత దుఃఖమయ జీవితాన్ని మరిచిపోగలిగాను. ఇప్పుడు, వాడు చనిపోగానే ఆవేదన తిరిగి ఆరంభమైంది. దాన్ని యీ విధంగా వ్యక్తపరుస్తున్నాను. కాని మిమ్మల్ని నిందించను. ఆ భగవంతుణ్ణే- యిలా నిష్కారణంగా వ్యథ కలుగజేసిన ఆ దేవుణ్ణే నిందిస్తాను. మీ మీద నాకెన్నడూ క్రోధభావం కలుగనేలేదు. పిల్లవాణ్ణి కనేసమయంలో ఆ అంతులేని బాధలోకూడా మీ మీద విసుక్కో లేదు. మీ అనురాగాన్ని పొందిన ఆ మూడు రాత్రులగురించీ నేనెప్పుడూ చింతించలేదు. మిమ్మల్ని ప్రేమించటం మానలేదు; నా జీవితంలో మీరు ప్రవేశించిన గడియను తలుచుకుని ఆనందించటం మానలేదు. ఆ గడియ మళ్ళీ నాకు సంప్రాప్తిస్తుందంటే, నరకానికి వెళ్లమన్నా వెడతాను- ఒకసారి కాదు- వెయ్యిసార్లయినాసరే.

మనకొడుకు నిన్ననేపోయాడు- పాపం, మీరు వాణ్ణి చూడనేలే దన్నడూ. వాడి ముద్దొచ్చే ముచ్చటైన విగ్రహాన్ని ఒక్కసారికూడా మీరు స్పృశించనేలేదు; వాడిమీద మీ చూపులెన్నడూ నిలువనేలేదు. మనకొడుకు పుట్టిన తర్వాత చాలాకాలంవరకూ మీ కంటపడకుండా తిరిగాను. మీ గురించి తపించటంలో తీవ్రతకొంచెం తగ్గింది. నిజానికి, యిదివరకటంత గాఢంగా మిమ్మల్ని ప్రేమించటంలేదనుకుంటాను. ఇప్పుడు నాకు కొడుకు ఉన్నాడు కాబట్టి మీ పై ప్రేమ అంతగా బాధించలేదు. మీకూ వాడికీ మధ్య నన్ను విభజించుకోవటం నాకు నచ్చలేదు. అందుకే నేనింక మీవశం కాలేదు. ఎలాగైనా మీరు స్వతంత్రంగా హాయిగా ఉన్నారు. కాని కుర్రవాడికి నేను అవసరం- వాణ్ణి పెంచాలి- వాణ్ణి ముద్దుపెట్టుకోవాలి లాలించాలి. మీ గురించి నేనుపొందే విరహవ్యథ కొంత మానిపోయింది. మీ ప్రతిరూపం నా కడుపునపుట్టి, నిజంగా నా స్వంతం కాగానే నా మీద

ఖారం కొంత తగ్గినట్లనిపించింది. ఇప్పుడింక తరుచుగా మీ గురించి ఆలోచనలు రావటంలేదు. కాని ఒక్కసంగతే— మీ పుట్టినరోజునాడు మాత్రం ప్రతిసంవత్సరం తెల్లగులాబీ పువ్వుల్ని పంపించేదాన్ని- సరిగ్గా ఆ మొదటిరాత్రి గడిచాక నాకు మీరిచ్చిన గులాబీల్లాంటివే. వాటిని యెవరు పంపించారని యీ పది పదకొండు సంవత్సరాల్లోనూ యెప్పుడైనా ఆలోచించారా ? ఒక ఆడపిల్లకి అటువంటి పువ్వులు మీ రిచ్చినట్లు యెప్పుడైనా గుర్తుకితెచ్చుకున్నారా ? ఏమో నాకు తెలియదు- నా కింకెప్పటికీ తెలియదు. అనామకంగా అంధకారంలోంచి మీకు వాటిని పంపటమే నా పని. ఏడాదికొకసారి ఆ గడియను తిరిగి జ్ఞప్తికి తెచ్చుకునేదాన్ని.

మన కొడుకుగురించి మీకేమీ తెలియదు. వాణ్ని మీ కంటపడకుండా చేసినందుకు యీనాడు నన్ను నేనే నిందించుకుంటున్నాను. చూస్తే వాణ్ని మీరెంతో ప్రేమించేవారు. వాడు నిద్రపోయి లేచేటప్పుడు తన కన్నులుతెరిచి- ఆ నల్లటినయనాలు- మీవే అవి- లోకాన్ని నన్నూ సంతోషంతో చూసే ఆ కన్నులు తెరిచి చిరునవ్వు నవ్వుతూండగా మీరెప్పుడూ చూడనేలేదు. వాడెంత తెలివైనవాడు, యెంత ముద్దొచ్చేవాడు ! మీ చురుకుతనం, మీ మనఃచాంచల్యం, అన్నీ వాడికబ్బినై- ఆ లక్షణాలు పసితనంలో మరింత ఉద్ధృతంగా కనిపిస్తాయి. మీరు జీవితంతో ఆటలాడినట్లుగా వాడు బొమ్మలాటలాడుతూ మైమరచిపోయేవాడు. ఆ వెంటనే మళ్ళీ ముఖావంగా అయిపోయి ఓమూలకూర్చుని కథల పుస్తకాలు చాలాసేపు చదువుతూ వుండేవాడు. వాడు మీరే- అది మీ పునర్జన్మ. ఆకతాయితనం, గాంభీర్యం- మీకుండే రెండు సహజలక్షణాలూ వాడిలో సుస్పష్టమవుతూండేవి. పాఠాలు శ్రద్ధగా చదువుకునేవాడు. ఇంగ్లీషులో వసపోసినపిట్టలా వాగుతూ వుండేవాడు. వాడితరగతిలోకెల్లా వాడి పుస్తకాలే పరిశుభ్రంగా వుండేవి. ఎంత చక్కగా, యెంతదర్జాగా ఉండేవాడు చిన్నపురుషుడులాగ! వాణ్ని తీసుకొని యేదైనా పార్కుకివెడితే, ఆడవాళ్లంతా వాడిచుట్టూచేరి వాడి జుట్టునీ, వాడి గడ్డాన్నీ ముద్దుపెట్టుకుంటూ వాణ్ని వొదిలేవారు కాదు. మొగవాళ్లు దూడా వాణ్ని చూసి విస్తుబోయేవారు. వాడు అంత అందంగా, అంత సరళంగా అంత ఆకర్షణీయంగా వుండేవాడు. ఓసారి కాలేజీలో ఆటలపోటీలు చూట్టానికి వెళ్ళినప్పుడు, నలగనిసూటు, నల్లనిబూట్లు, చిన్నదొరలటోపీ, నెక్‌టై....

టిప్‌టాప్‌గా వెళ్లాడు- యిప్పుడీ కుక్కిమంచంలో యీ నికృష్టస్థితిలో- పాలి పోయిన పెదవులతో, చేతులు కట్టుకొని...

వాడికన్ని విలువైన వస్తువులు కొనిపెట్టి వాణ్ని అంతదర్జాగా పెంచి వాడిక ధనవంతుల ప్రపంచంలో ప్రవేశార్హత యేవిధంగా కల్పించానని మీరు ఆశ్చర్యపోతారు. నేను అంధకారంలోంచి మాట్లాడుతున్నానని మీకు చెప్పాను కదండీ. సిగ్గులేకుండా చెబుతున్నాను మీకు. చెవులు మూసు కొని ముఖం చిట్లించుకోకండి. నన్ను నేనే విక్రయించుకున్నాను- అంటే వేశ్యావృత్తిని అవలంబించానని కాదు- నన్ను విక్రయించుకున్నానంతే. నా స్నేహితులు చాలా డబ్బున్నవాళ్లు. మొదట్లో నేనే వాళ్లని ఆశ్రయించాను. అతర్వాత వాళ్లే నన్ను వెతుక్కుంటూ రావటం ప్రారంభించారు- ఎంచేత నంటే (మీరెప్పుడైనా గమనించారో లేదో!) నేను అందమైనదాన్ని. నన్ను అనుభవించిన ప్రతివాళ్లూ నన్ను ఆరాధించేవారు. వారందరి కృతజ్ఞతనూ, ప్రశంసనూ పొందేదాన్ని. వాళ్లందరూ నన్ను ప్రేమతో చూశారు- మీ రొక్కరుతప్ప- నాకు ప్రేమాస్పదులైన మీరొక్కరు తప్ప.

నేను చేసినపని చెప్పినతర్వాత నన్నిప్పుడు నీచంగా పరిగణిస్తారా? అలా చెయ్యరనే నా నమ్మకం. మీరంతా అర్థంచేసుకుంటారని నాకు తెలు సును- నేచేసినదంతా మీకోసమే- మీ ప్రతిరూపం కోసం- మీ కొడుకుకోస మేనని మీరు గ్రహిస్తారు. ఆ ఆసుపత్రిలో పడివుండగా దారిద్ర్యం పెట్టే ఘోర యమయాతన అంతా అనుభవించాను. దరిద్రలోకంలో అథఃపాతా ళంలో అణగిపోయినవాళ్లే యెప్పుడూ పాపాలకు గురిఅవుతుంటారు. మీ కొడుకు- అంతముద్దొచ్చే కుర్రాడు అటువంటి నరకంలో, వీధుల్లో నానా పాపిష్ఠిపనులు చేస్తూ, పూరిగుడిసెల్లో విషవాయువులు పీలుస్తూ జీవించటం- ఊహలో కూడా భరించలేకపోయాను. వాడి సున్నితమైన అధరాలు బూతులు మాట్లాడటం నేర్చుకోకూడదు. వెన్నపూసలాంటి వాడి వొంటిమీద బట్టయినా లేకుండా యెండకీ వానకీ బలికావటం నేను సహించలేను. మీ కొడుక్కి ప్రపంచంలో కల్లా మంచివన్నీ కావాలి; ధనం, సౌఖ్యం అన్నీ అనుభవించాలి బాదరాబందీ లేకుండా. జీవితంలో వాడు మీ అడుగుజా

డల్ని అనుసరించాలి. మీరు విహరించిన వాతావరణంలోనే వాడు కూడా విహరించాలి.

అందుకోసమే నన్ను నేను విక్రయించుకున్నాను. నేనేమీ త్యాగం చేశానని చెప్పటంలేదు. సంఘం శాస్త్రయుక్తంగా పలికే "నీతి" "అవినీతి" అన్న పదాలు నాకు అర్థశూన్యంగా కనిపిస్తాయి. నా దేహం మీ ఒక్కరితో చెందుతుంది. మీరు నన్ను ప్రేమించనప్పుడు నా దేహాన్ని నేనేంచేస్తే యే మవుతుంది కనక ? నా స్నేహితుల సరసాలుగాని, వారి గాఢానురాగంకాని నా హృదయతంత్రుల్ని మీటలేకపోయినై. వారిలో కొంతమందిని గౌరవించ కుండా వుండలేక పోయేదాన్ని. నా విధిని తలుచుకున్నప్పుడు వారి వ్యర్థాను రాగాలనుచూసి వారిపైన జాలి కలిగేది. వీళ్లంతా నన్ను ప్రేమతోనే చూసే వారు. నన్నెంతో అల్లారుముద్దుగా గారాబంగా చూసుకునేవారు. అందరూ యెంతో ధనసహాయం చేసేవారు. వారిలో ఒక భార్యా వియోగి, బాగావయస్సు మీరినవాడు, పేరు ప్రతిష్ఠలున్నవాడు, తన పరపతినంతా వినియోగించి మీ కొడుక్కి పబ్లిక్‌స్కూల్లో సీటు సంపాదించిపెట్టాడు. ఈయన నన్ను కన్న కూతురిలా చూసుకునేవాడు. నాలుగైదుసార్లు తనని పెళ్లి చెసుకోమనికూడా బలవంత పెట్టాడు. అలాగేఅయితే నే నీన్నాటికి ఓ లక్షాధికారిణినై, బంజారా కొండల్లో పెద్ద భవంతిలో ఉండేదాన్ని. కుర్రవాడిగురించి యే బెంగ లేకుండా ఉండేదాన్ని. వాడికికూడా ప్రేమించే తండ్రి, నాకు మంచి దయా మయుడైన భర్త లభించేవాడు. ఆయనకి బాధ కలుగుతుందని తెలిసినా, వివాహానికి మొండిగా వొప్పుకోలేదు. బహుశా నాది మూర్ఖత్వమే కావచ్చు- లేకుంటే నేను లొంగిపోయినట్లయితే యీ పాటికి యెక్కడో ప్రశాంతమైన గృహజీవితాన్ని గడుపుతూ ఉండేదాన్ని- నా బిడ్డకి గతి పట్టకపోయేది. నే నంత మొండికెత్తడానికి కారణం మీ దగ్గరెందుకు దాచటం ? నిర్బంధంలో వుండటం నా కిష్టంలేదు. స్వేచ్ఛగా వుండాలనుకున్నాను- మీ కోసమే. నా అంతరాంతరాల్లో నాకు తెలియకుండానే, చిన్నతనంలో నేను కన్నకల లనే యింకా కలగంటూవుండేదాన్ని. ఏనాడో ఒకనాడు మీరు నన్ను చేర దీస్తారేమో- ఒక గంటసేపటికోసమైనాసరే. ఈ ఒకగంట అవకాశంకోసం, మీ పిలుపువిని బదులు పలికేందుకు స్వేచ్ఛగా వుండాలనే అన్నిటినీ త్రోసి పుచ్చాను. నాలో స్త్రీత్వం మేలుకొన్నప్పటినుంచీ నా జీవితంలో నిరీక్షణ

తప్ప, మీ పిలుపుకోసం నిరీక్షించటం తప్ప నేను చేసినదేముంది ?

ఆఖరుకి నేను ఆశించిన సమయం ఆసన్నమైంది, అయినా దాని రాక మీ కింకా తెలియదు ! అది వచ్చినప్పుడు మీరు నన్ను గుర్తించలేదు. మీరు నన్నెప్పటికీ గుర్తించనేలేదు – – యెప్పటికీ.... యెప్పటికీ. సినిమాల్లోనూ సభల్లోనూ, పార్కుల్లోనూ యిక్కడా అక్కడా చాలాసార్లే మిమ్మల్ని కలుసుకున్నాను. ప్రతిసారీ నా హృదయం గంతులువేసేది, కాని మీరు నన్ను లక్ష్యం చెయ్యకుండానే నా పక్కనుంచే వెళ్ళిపోయేవారు. బాహ్యరూపానికి నేను మరో మనిషినై పోయాననే చెప్పాలి. సిగ్గుతో ముడుచుకుపోయే ఆప్పటి కన్య– నేడు యువతి. అందకత్తె– అని చెప్పుకుంటారు. చక్కని దుస్తులు ధరించిబాగా ముస్తాబై చుట్టూ స్నేహితులతోఉన్న నన్నుచూసి, ఆనాడు మీ పడకగదిలో మసకదీపం వెలుగులో సిగ్గుతో మెలగిన ఆ అమ్మాయేనని యెలా గుర్తుపట్టగలరు ? ఒక్కొక్కప్పుడు నా కూడావున్న స్నేహితుడు మిమ్మల్ని పలుకరిస్తే అతన్నితిరిగి చిరునవ్వుతో పలుకరిస్తూ నా వైపు వీక్షించేవారు. కాని ఆ చూపు– ఒక అపరిచితుడు మర్యాదగా చూసేచూపు విరుద్ధమైనచూపు– అంతేకాని, దూరంలో, అనంతదూరంలో వున్నదాన్ని గుర్తుపట్టిన చూపు కాదది. ఒకసారి నాకు బాగా జ్ఞాపకం– మామూలు ప్రకారం మీరు నన్ను గుర్తుపట్టకపోయేసరికి యమయాతన అనుభవించాను. ఒక స్నేహితుడితోకలిసి సినిమాకివెళ్ళాను. ఇద్దరం బాక్స్‌లో కూర్చున్నాము. ఇంతలోకే మీరు వచ్చి ఆ పక్కబాక్స్‌లోనే కూర్చున్నారు. సినిమా ప్రారంభంకాగానే దీపాలన్నీ ఆరిపోయాయి. మీ ముఖాన్ని చూడటం యింక సాధ్యంకాలేదు. కాని నాకెంతో దగ్గరగా ఉండటం మూలాన్ని మీరు ఊపిరి పీల్చటం నేను బాగా గ్రహించాను– అచ్చు ఆనాడు నేను మీ గదిలో ఉన్నప్పుడు పీల్చినట్టుగానే. సోఫా చేతిమీద మీ సుకుమార హస్తాన్ని ఆన్చి కూర్చున్నారు. మనిద్దరిమధ్య ముఖమల్ తెర వ్రేలాడుతోంది. ముందుకి వంగి మీ హస్తాన్ని– ఒకసారి యింతకుముందు దాని సజీవ స్పర్శ నెరిగిన కారణంగా, దాన్ని చుంబించాలనే వాంఛతీవ్ర మవుతున్నది. సంగీతం స్థాయి హెచ్చుతున్నకొద్దీ నా వాంఛ అత్యధిక మవుతున్నది. నా అధరాలు మీ హస్తాన్ని సమీపించకుండా బలవంతాన ఉద్రేకాన్ని అణుచుకున్నాను. ఆట యింకా సగమైనా కాకుండానే నా స్నేహితునితో నాకు వెళ్ళిపోవాలని

వుందన్నాను. ఆ విధంగా అంధకారంలో మిమ్మల్ని అంత సమీపంలో పెట్టుకుని అంత అపరిచితంగా కూర్చోవటం దుర్భరమనిపించింది.

కాని ఆఘడియ మరోసారి వచ్చింది- మరొక్కసారి మాత్రమే. అంతా చేసి ఒక యేడాది అవుతుందేమో యిప్పటికి- సరిగ్గా మీ పుట్టినరోజైన మర్నాడు. మీగురించి ఆలోచనలు మామూలుగాకన్న అధికంగా నా మెదడును చుట్టుముట్టినై. మీ జన్మదినాన్ని నేను మహోత్సవంగా పరిగణించేదాన్ని. ఆరోజు ఉదయాన్నే లేచి స్వయంగా బజారుకి వెళ్ళి తెల్లని గులాబీ పూలగుత్తుల్ని కొని, మీరేనాడో మరిచిపోయిన ఆ ఘడియ జ్ఞాపకార్థం వాటిని మీకు పంపించాను. మధ్యాహ్నం నా కొడుకుని తీసుకొని హోటలుకి వెళ్ళి వాడికి కావలసిన ఫలహారాలన్నీ తినిపించాను. సాయంకాలం వాణ్ని సినిమాకి తీసికెళ్లాను. జీవితాంతంవరకూ యీ రోజునెంతో పవిత్రంగా యెంచుకోమని వాడితో చెప్పాను. కారణం వాడు తెలుసుకోలేకపోయాడు. ఆ మర్నాడు, ఆ రోజుల్లో నాతో యెంతో చనువుగా మెలుగుతున్న ఒక స్నేహితునితో కలిసి కాలక్షేపం చేశాను. అతను యువకుడు- ఒక పెద్ద ఫ్యాక్టరీ యజమానికొడుకు. నేనంటే పిచ్చెత్తిపోయేవాడు. అతను కూడా నన్ను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. నేను నిరాకరించాను- ఎందుచేతనో, అతను అర్థంచేసుకోలేకపోయాడు. అయినా నాకూ నా కొడుక్కీ బోలెడు బహుమతులూ, అవీయివీ యిస్తూండేవాడు. అంత వెర్రిగా దాసుడులా ఆరాధిస్తూంటే, పాపం, చూస్తే జాలేసేది. ఒక సంగీత సభకి వెళ్లాం యిద్దరం కలిసి. అక్కడ కొంతమంది భలేసరదాగా వుండేవాళ్లు కలిశారు. అందరం కలిసి మళ్ళీ ఆరాత్రి ఒక పెద్ద హోటలులో భోజనం చేద్దామని వెళ్లాం. అందరం సరదాగా నవ్వుతూ హాయిగా కబుర్లు చెప్పుకుంటున్నాం. సాధారణంగా అంత గందరగోళంగా వుండి నానారకాలవాళ్లూ వచ్చి గుడ్లు పెద్దవిచేసుకొని ఆడవాళ్లకేసి చూసేరకం మనుషులున్నచోటికి నాకు వెళ్లబుద్ధి పుట్టదు. కాని యీ రోజున యెందుకో సరదాగా నలుగురితో కలిసి కాలక్షేపం చెయ్యాలనిపించింది. ఏదో అసాధారణమైన అనుభవం నాకు కలుగబోతోందన్నట్టుగా యేదో అదృశ్య శక్తి నాలో ఉద్రేకాన్ని కలిగించింది. ఉత్సాహంతో యేవేవో మాట్లాడుతూ అందరినీ కడుపుచెక్కలయేట్టు నవ్విస్తున్నాను. ఇంతలో హఠాత్తుగా నా హృదిలో హిమవర్షం కురిసినట్లో, అగ్ని జ్వాలలు రేగినట్లో

అయింది—అంతా ఒక్క క్షణంలో.. మా కెదురుగా మరో బల్లముందు స్నేహితులతో కలిసి మీరు కూర్చున్నారు. ఆసక్తి, ప్రసంసలతో కూడిన చూపుతో నన్ను దీక్షగా గమనిస్తున్నారు—అ చూపే నన్ను అనునిత్యం యెంత సమ్మోహపరుస్తుందో—అది వర్ణనాతీతం. పది దీర్ఘ సంవత్స రాల అనంతరం మళ్ళీ మీరు స్వభావసిద్ధమైన అంతరంగిక వాంఛా ప్రేరింతంగా నావైపు చూస్తున్నారు. నేను కంపించిపోయాను. నా చేతులు విపరీతంగా వొణికిపోయినై. అదృష్టవశాత్తు నా స్నేహితులు నా పరిస్థితిని గమనించలేదు. వాళ్ల కబుర్లు, నవ్వుల గందరగోళంలో మరోవిషయాన్ని వాళ్లు పట్టించుకోవటం లేదు. అంతకంతకు మీ వీక్షణం తీక్షణమై నా శరీ రాన్ని నా స్వాధీనంలో లేకుండా చేసింది. ఆఖరుకిప్పటికైనా మీరు నన్ను గుర్తించారో లేదో గ్రహించలేకపోయాను. ఆ వీక్షణం మీరు నన్ను గుర్తించిన ఫలితమో, లేక ఒక అపరిచిత రగుల్కొల్పిన కామవాంఛా ప్రేరి తమో అర్థంకాలేదు. నా చెక్కిళ్లు యెరుపెక్కినై. ఒక్కవరసని అర్థం బర్థం లేకుండా వాగటం మొదలుపెట్టాను. మీచూపు నాపైన యెట్టి ప్రభా వాన్ని కలిగించిందో మీరు గమనించకుండా ఉండలేకపోయారు. ఆ పక్క గదిలోకి రమ్మన్నట్లుగా తమాషాగా యెవరికీ తెలియకుండా మీ తల ఆడించారు. మీ స్నేహితులకో నమస్కారం పెట్టేసి, వెళ్ళిపోతూ వొకసారి మళ్ళీ నావైపుచూసి అక్కడగదిలో వేచివుంటాను, రమ్మన్నట్లు సంజ్ఞ చేశారు. చలిజ్వరం కుదిపినట్లుగా నాతల ఊపేశాను. వాళ్లేదో అడుగుతూంటే నేను సమాధానం చెప్పలేకపోయాను. నా నరాల్లోని ఉద్రిక్తతను యింకెంత మాత్రం అణచుకోలేకపోయాను. ఇంతలో రెండు తెల్లగుర్రాలు యిద్దరు మగవాళ్లను వెంటబెట్టుకొని అక్కడికొచ్చాయి సకిలిస్తూ. అందరూ మెడలు వెనక్కి తిప్పి ఆ నారీమణులవైపు దృష్టి సారించారు. ఆ అవకాశాన్ని అందుకొని నేను వెంటనే లేచి, నా స్నేహితునితో, యిప్పుడే రెండు నిముషాల్లో వచ్చేస్తానని చెప్పి మిమ్మల్ని అనుసరించాను.

మీరు వరండాలో నాకోసం చూస్తూ నిల్చున్నారు. నన్ను చూడగానే మీ ముఖం వికసించిరిది. పెదవులపైన చిరునవ్వు ప్రదర్శిస్తూ నన్ను సమీపించారుఆత్రుతగా.. అనాటి చిన్నపిల్లగాని, సిగ్గు పడుతూ మీదగ్గరికి వచ్చిన కన్నెపిల్లగాని, మీకు జ్ఞప్తికి రానేలేదు. మళ్ళీ నేను మీకు నూతన పరిచితనే.

"ఓ గంటసేపు నాతో గడపటానికి వీలుంటుందా ?" అని అడిగారు విశ్వాసపూరిత కంఠంతో. ఒక రాత్రికి యెవరికైనా సరే అమ్ముడుపోయే బాపతుగా నా గురించి మీరు భావించారని స్పష్టంగా తెలుస్తోంది. "ఓ,తప్ప కుండా" అన్నాను నేను. నా చిన్నతనంలో పదేళ్లక్రితం ఆ చీకటి సందులో మీరు విన్నట్లుగానే యిప్పుడుకూడా 'ఓ....' అని వెంటనేఅన్నాను. "అయితే యెప్పుడు కలుసుకుందామో చెప్పు" అన్నారు మీరు. "మీయిష్టం వచ్చి నప్పుడు" అని సమాధానమిచ్చాను. మీరు సంబంధించిన వ్యవహారంలో సిగ్గుపడవలసిన అగత్యంనాకు కనిపించలేదు. ఆశ్చర్యంగా చూశారు నా కేసి- యిదివరకులాగే అనుమానమూ, అసక్తితోదూడిన ఆశ్చర్యమది. ఓ క్షణం సంకోచించి, "అయితే యిప్పుడు వస్తావా ?" అని అడిగారు. "ఊఁ" అన్నాను. "సరే, పద," అంటూ దారితీశారు మీరు.

నా కప్పుడు గుర్తుకొచ్చింది- నా ఓవర్‌కోటు నేను కూర్చున్న హోటులో విడిచివచ్చేశానన్న సంగతి. ఇప్పుడువెళ్లి దాన్ని తెచ్చుకోవాలంటే అస్నేహి తుడు యెక్కడికి వెడుతున్నావని అడుగుతాడు. ఏమని చెప్పటం ? ఏం చెయ్యటం ? అక్కడికి తిరిగి వెళ్ళి అతనితోచెప్పి కోటు తెచ్చుకురావటం అసంభవం. అయితే, మీతో ఓ గంటసేపు గడిపే అవకాశం కోసం యిన్నేళ్లు యెదురుచూసి, చివరికి దాన్ని జారవిడుచుకోవటం అంతకన్న అసాధ్యం. తక్షణం ఒక నిర్ణయాని కొచ్చాను.

చేతిలోని ముఖమల్ సంచీని ఊపుకుంటూ ఆ నిశీధిలో మీ వెంట నడిచాను. నా ఊలుకోటు గురించి గాని, రెండేళ్లనుంచి నన్ను చేరదీసి ఆదరిస్తున్న ఆ దయామయుడి గురించిగాని, ఒక అపరచితుని కనుసైగకు లొంగిపోయి ఆ మనిషిని నలుగురు స్నేహితులలోనూ నవ్వులపాలు చేస్తున్నా నని గాని కించిత్తు లెక్కచెయ్యలేదు. అంతమంచి స్నేహితునిపట్ల యెంత కృతఘ్నతతో, యెంత నీచంగా ప్రవర్తిస్తున్నానో నా మనస్సుకి బాగా తెలుసు నేను చేస్తున్న ఘోరమయిన అపరాధం అతన్నీ నన్నూ యిక శాశ్వతంగా వేరు చేస్తుందనీ, నా బ్రతుకుతో నేనే పరిహాసమాడుతున్నాననీ నాకు తెలుసు. మన తాత్కాలిక సంయోగంముందర అతని స్నేహమెంత, నాజీవితమెంత! మీ అధరామృతాన్ని ఆస్వాదించి, మీ కంఠస్వరాన్ని ఆలకించే అదృష్టం నాకు మళ్ళీ కలిగింది. ఇప్పుడదంతా అయిపోయింది కాబట్టి, నేను మిమ్మల్ని

యెంత ప్రేమించానో యిప్పుడు చెప్పగలను. నేను నా మరణ శయ్యమీద ఉండగా మీ పిలుపు వినిపించినా, మీకు బదులు పలకటానికి యెలాగో ఓపిక తెచ్చుకుంటాననే నా నమ్మకం.

వీధిలో అద్దెకారు సిద్ధంగా ఉంది. అందులోకూర్చుని మీ యింటికి బయలుదేరాం. మీ కంఠస్వరాన్ని మళ్ళీ ఆలకించ గలిగాను; మీ సామీప్యతవల్ల కలిగే సంభ్రమాన్ని మళ్ళీ పొందగలిగాను; ఏనాటి క్రితమో ఉన్నట్లుగానే సంతోషంతో ఉబ్బితబ్బిబై నా శరీరం మత్తెక్కినట్లనిపించింది. ఆ మేడమెట్లు మీంచి మీతో కలిసి యెక్కుతూంటే పదేళ్లక్రితం పొందిన ఆనందాన్నే తిరిగి సరిక్రొత్తగా యెలా పొందగలిగానో, గతంలోనూ ప్రస్తుతం లోనూ ఒకేసారి నేనెలా జీవించానో, నా సర్వస్వమూ మీలో యెలా ఐక్యమై పోయిందో నేనేమని వర్ణించను ? మీగదుల్లో అట్టేమార్పులు రాలేదు. గోడలమీద మరికొన్ని చిత్రాలుచేరాయి. బీరువాల్లో పుస్తకాలు కిక్కిరిసి పోయాయి. సామానుకూడా కొంత పెరిగింది- కాని, మొత్తం మీద ఆ ప్రదేశమంతా చిర పరిచితంగా, చనువుగా కనిపించింది. ఆ వ్రాతబల్ల మీద నీలం గాజుకూజా- అందులో గులాబీలు- మీకేనాడూ జ్ఞప్తికిరాని .. మీ కత్యంత సమీపంలో, మీ బాహు బంధనలో మీఅధర స్పర్శననుభవిస్తు న్నప్పటికీ జ్ఞప్తికిరాని ఒక ఆడది పంపిన పువ్వులవి. ఏమయినప్పటికీ, నా పువ్వులు అక్కడ ఉండటం నాకు సంతృప్తి కరంగాఉంది. నాప్రేమ చిహ్నం, నాకు చెందినదేదో వొకటి మీ ఆదరణను పొంద గలిగినందుకు సంతోషించాను.

మీరు నన్ను మీ బాహువులతో బంధించారు. అద్భుతమైన అరాత్రంతా మీ వద్దనే వుండిపోయాను. అప్పటికికూడా నన్ను మీరు గుర్తించనేలేదు. ఒక వేశ్యపైన, ప్రియురాలిపైన మీరు చూపే అనురక్తిలో భేదమేమీ ఉండదని స్పష్టంగా తెలిసిందినాకు-అనురాగభరితమైన మీ చేష్టలకు పరవశత్వం పొందుతున్నప్పుడు. మీ దృష్టికి నేను అపరిచితనైనప్పటికీ, యేదో యథాలాపంగా ఓ హోటల్లో కనిపించి వెంటపడినప్పటికీ, నాతో మీరెంతో ఆప్యాయంగా, మర్యాదగా ప్రవర్తించారు. నన్ను చులకనగా యెంతమాత్రం చూడలేదు. వినూత్న ఉత్సాహంతో పరవశత్వం పొందినట్లు కనిపించారు.

గత సుఖాలమైకంలో మీ ద్వంద్వముఖ స్వభావం గుర్తుకొచ్చింది.... విజ్ఞాన దీప్తి, కామాంధకారం- యీ రెండు విరుద్ధశక్తుల విచిత్ర సమ్మేళనమే నా శైశవంలో నన్ను మీ బానిసగా చేసింది. క్షణికానందంకోసం మరే పురుషునికీ యీ విధంగా నా సర్వస్వాన్నీ ధార పోయలేదు. తాత్కాలిక సౌఖ్యంలో యింకే పురుషుడూ మీకు మల్లే మనస్ఫూర్తిగా తన్ను తాను సమర్పించేసుకోడు. కాని విచిత్రం- ఆ ఘడియకాగానే అనంత, అమానుష విస్మృతిలో మునిగిపోతారు! అయితే, ఆ సమయంలో నేనూ నా సర్వాన్నీ మరిచిపోయాను. అంధకారంలో మీ ప్రక్కనే పవళించిన నేనెవరిని? మీ కొడుకుని కన్న తల్లినా? ఒక అపరిచితనా? అద్భుతమైన ఆరాత్రి, ప్రతీదీ చిరపరిచితంగానూ, వినూత్నంగానూ గోచరించింది. ఈ ఆనందం అనంతంగా వుండిపోవాలని ప్రార్థించాను.

కాని తెల్లవారింది. మనము లేచేటప్పటికి బాగా ప్రొద్దుపోయింది- కాఫీ అది తీసుకున్నాక వెళ్లొచ్చులెమ్మన్నారు నాతో. కాఫీ వగైరాలను యేదో అదృశ్యహస్తం ప్రత్యేకంగా పక్కగదిలో సిద్ధంచేసిపెట్టింది. నెమ్మదిగా మాట్లాడుకున్నాం. ఇదివరకులాగే మీరు మర్యాదగా మనస్సువిప్పి మాట్లాడారు... యిదివరకులాగ చమత్కారంగా ప్రశ్నించలేదు. నాగురించి కుతూహలం చూపలేదు. నాపేరుగాని ఊరుగాని యేమిటని అడగలేదు. మీకు నేనుమట్టుకు మామూలుగా ఒక అనామక స్త్రీని- యిదొక యథాలాప పరిచయం- ఆనందదాయకమైన అనుభవం- అదికాగానే, మీ మనస్సులో దాని జాడలేమీ మిగలవు. అప్పుడే చెప్పారు మీరు- ఆనాడు మీ ప్రయాణం వున్నదనీ, ఉత్తరహిందూస్థానం వెళ్లవలసి వుందనీ అన్నారు. ఆ సుఖ సమయంలో మీ మాటలు ఆభిచారిక మంత్రాల్లా వినిపించాయి నాకు. ''అయిపోయింది, అయిపోయింది.. అంతా గతించిపోయింది''.... మీ పాదాలపైన పడిపోయి ''నన్నూ మీతో తీసుకుపొండి.. యిప్పటికైనా స్వీకరించండి'' అని హృదయద్వారా యేడవాలనిపించింది. కాని సిగ్గు, పిరికితనం, బానిసత్వం, నీరసం నన్ను ఆవహించాయి. ''అయ్యో!'' అని మాత్రం అనగలిగాను చచ్చుగా. మీరు చిరునవ్వుతో నాకేసి చూస్తూ ''ఏం నిజంగా అంత బాధగా వుందా?'' అని అడిగారు.

ఒక క్షణంపాటు కొయ్యబారి పోయినట్టయాను. నిశ్చలంగా నిలబడి మీ కేసి సూటిగా చూశాను. "నేను ప్రేమించిన మనిషి యెప్పుడూ ప్రయాణం చేస్తూనేవుంటాడు." అన్నాను, మీ కళ్లల్లోకి సూటిగాచూస్తూ. "ఇంక... యిప్పుడు... మీరు నన్ను అనవాలు పట్టేస్తారు!" అనుకున్నాను ఉత్సాహంగా. మీరు ఓ చిరునవ్వు నవ్వారంతే. నన్ను ఓ దార్చడానికి "వెళ్ళిన వాడెప్పటికైనా తిరిగివస్తాడు" అన్నారు. "అవును, తిరిగివస్తారు.... కాని ఆ వచ్చేలోపునే గతాన్నంతా మరిచిపోతారు."

ఎంతో బాధతో ఆ మాటలనివుంటారు– నా కంఠం గద్గదమవటం మీరు గమనించారు. కుర్చీలోంచి లేచారు మీరుకూడా. నా వైపు ఆశ్చర్యంగా, జాలిగా చూశారు. నా భుజాలమీద మీ చేతులాన్చి, "మంచివాటినెప్పుడూ మరిచిపోరు... నిన్ను మరిచిపోను" అన్నారు. నా రూపాన్ని మీ మనస్సులో చిత్రుంచు కోవటానికన్నట్లుగా మీ కన్నులు నన్ను దీక్షగా పరిశీలించాయి, నా ఆపాదమస్తకమూ పరిశీలించే మీ తీక్షణ వీక్షణాన్నిచూసి, యీ నాటికైనా చివరికి మీ కళ్లముందున్న చీకటితెర చీలిపోతుందని భ్రమించాను. "నన్ను గుర్తుపడతారు! నన్ను గుర్తుపడతారు"! ఆశతో నా ఆత్మ తహ తహ లాడింది.

కాని మీరు నన్ను గుర్తుపట్టనేలేదు... లేదు....మీరుగుర్తుపట్టలేదు. ఆ క్షణంలో మీకంటికి నేనుకనిపించినంత అపరిచితంగా అంతకుముందెప్పుడూ కనిపించలేదనే చెప్పాలి– లేకపోతే, కొద్దిక్షణాలతర్వాత మీ ప్రవర్తన ఆ విధంగా వుండేది కాదు– మీరు నన్ను మళ్ళీ ముద్దు పెట్టుకున్నారు– గట్టిగా ముద్దుపెట్టుకున్నారు. నా జుట్టంతా రేగిపోయింది– మళ్ళీ దువ్వుకో వలసివచ్చింది. అద్దంయెదుటనిలబడి అందులో చూసుకున్నాను–చూస్తూండగా ఘోరమైన అవమానంతో కృంగిపోయాను– మీరు రహస్యంగా బల్లమీద ఉన్న నా చేతిసంచీ తీసుకుని అందులో రూపాయనోట్లు కుక్కేస్తున్నారు. ఎంతోకష్టంమీద వస్తున్న ఏడుపును ఆపుకున్నాను; యెంతో కష్టంమీద మీ చెంప పగలకొట్టాలన్న ఉద్రేకాన్ని అణచుకున్నాను. చిన్నతనంనుంచీ మిమ్మల్ని ప్రేమిస్తూ, మీ కొడుకుని కన్నతల్లినైన నేను, మీతో గడిపిన

రాత్రికి నాకు మీరు డబ్బు ముట్టచెబుతున్నారు. ఏదో హోటల్లో తటస్థపడిన ఓ భోగందాన్ననే మీ ఉద్దేశం. మీరు నన్ను మరిచిపోవటం చాలక, నాకు డబ్బుచెల్లిస్తూ నన్ను అవమానిస్తున్నారు.

వీలైనంత త్వరగా అక్కణ్ణించి తప్పించుకోవాలని గబ గబా బిడ అల్లేసుకుని జోళ్లు తొడిగేసుకున్నాను. ఆ బాధ దుర్భరంగావుంది. హేండ్ బేగ్ కోసం చూశాను. అది మీ వ్రాతబల్లమీదనే వుంది— ఆ గులాబీపువ్వు లున్న పూలకూజా ప్రక్కని. ఆఖరు సారిగా మరొక్కసారి మీ జ్ఞాపకాన్ని మేల్కొపాలనే కోరికను అణచుకోలేక, "మీ తెల్ల గులాబీపువ్వుల్లో ఒకటి నాకిస్తారా ?" అని అడిగాను. "నిరభ్యంతరంగా !" అన్నారు ఆకూజాలోవున్న పువ్వులన్నింటినీ తీస్తూ.

"బహుశా వాటిని యే స్త్రీ అయినా... మిమ్మల్ని ప్రేమిస్తున్న యే స్త్రీ అయినా మీకోసం పంపించేమో ?" — "కావచ్చు... నాకు తెలియదు" అని జవాబిచ్చారు మీరు. కాస్సేపాగి, "అవి బహుమానంగానె వచ్చాయి.. కాని వాటిని పంపించినవారెవరో నాకు తెలియదు.... అందుకే అవంటే నాకెంతో యిష్టం" అన్నారు. మీవైపు భావగర్భితంగా చూస్తూ, "బహుశా వాటిని పంపిన స్త్రీని మీరు మరిచిపోయారేమో !" అన్నాను.

మీరు ఆశ్చర్యపోయారు. మరింత శ్రద్ధగా చూశాను మీకేసి. "గుర్తించండి.... నేటికైనా నన్ను గుర్తించండి.. చాలు" అని నా కన్నులు మొఱపెట్టుకుంటున్నాయి. మీ చిరునవ్వులో జిజ్ఞాసేగాని జ్ఞాపకంలేదు. మళ్ళీ ముద్దుపెట్టుకున్నారు నన్ను, కాని నేను జ్ఞాపకంరాలేదు.

నేను హడావిడిగా బయలుదేరాను. నా కళ్లనిండా నీళ్లు నిండాయి— మీరు గమనించటం నాకిష్టంలేదు. గుమ్మంలో అడుగుపెడుతూండగా మీ నౌకరు, రంగన్న యెదురుపడ్డాడు. సంకోచిస్తూ, వినయంగా నా దారిలోంచి తప్పుకుని పక్కగా నిలబడ్డాడు. ఆ పలాయన సమయంలోనే కన్నీటితో అతని ముఖాన్ని చూశాను. ఆ ముసలివాడి ముఖంలో యేదో మెరుపు చటుక్కున మెరిసింది. ఈ పలాయన సమయంలోనే, అతను నన్ను గుర్తుపట్టాడు. నా చిన్నతనంలో నేనాయింట్లో వుండేరోజుల్లో చూశాడంతే — యిప్పటివరకూ మళ్ళీ చూడలేదు. అయినా అతను గుఱుతుపట్టాడు. నా

హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.... వొంగి అతని పాదాలముందు ప్రణమిల్లాలనిపించింది. మీరు నా సంచీలో పెట్టి నన్ను బాధించిన మీ రూపాయల్ని పైకి తీసి అతని చేతుల్లో కుక్కేశాను. తెల్లబోయి చూశాడు పాకేస. ఆ వొక్కక్షణంలో అతను నన్ను అర్థంచేసుకున్నంతగా మీరు మీ జీవితమంతటిలో నన్ను అర్థంచేసుకోలేకపోయారు. ప్రతివాళ్లూ నన్ను ఆదరించటానికి ఆత్రుతపడ్డారు. కావలసినంత అభిమానాన్ని చూపించారు. కాని మీరే, మీ వొక్కరే నన్ను విస్మరించారు, మీరే, మీ వొక్కరే నన్ను గుర్తించలేదు.

నాకొడుకు, మన కొడుకు చనిపోయాడు. నా ప్రేమపాత్రులెవ్వరూ లేరింక.... మీరు మినహా నాకీప్రపంచంలో యెవ్వరూ లేరు. అయితే, మీ వల్ల వొరిగేదేమిటి ? ఇంతవరకు మీరు నన్ను గుర్తించనేలేదు. ఓపిల్లకాలువని దాటుకొని వెళ్ళిపోయినట్లు, దారిలో అడ్డొచ్చిన రాయిని తప్పించుకుపోయినట్లు నన్ను లెక్కచెయ్యకుండా మీదారిని మీరు వెళ్ళిపోయారు— నేను మాత్రం మీ కొరకు అనంతంగా నిరీక్షించాలి! ఒకప్పుడనుకున్నాను మిమ్మల్ని నా స్వాధీనం చేసుకోగలనని. మీరు తప్పించుకుపోయినా, మీ ప్రతిరూపాన్ని - పసిపాపని స్వాధీనం చేసుకున్నాననుకున్నాను. కాని వాడు మీకొడుకే! అర్ధరాత్రి, దయాదాక్షిణ్యాలు లేకుండా దారిలో నన్నొంటరిగా వొదిలేసి తను చల్లగా జారుకున్నాడు. వాడు నన్ను మరిచిపోయాడు- వాడింక తిరిగి రాడు. మళ్ళీ ఒంటరిదాన్నైపోయాను- మరీ ఒంటరిదాన్నైపోయాను. నాకేమీ లేదు, మీవల్ల నాకే మీరాదు. ఒక బిడ్డగాని, ఒక మాటగాని, ఒక ఉత్తరం ముక్కగాని.... చివరికి మీ జ్ఞాపకానికి కూడా నోచుకోలేదు. ఎవరైనా నా గురించి మీ యెదుట సంభాషిస్తే, ఒకఅపరిచిత గురించే ననుకుంటారు మీరు. మీదృష్టిలో నేను గతించిపోయినప్పుడు, నేను చనిపోవడానికి సంతోషించనూ ? మీరు నానుంచి దూరంగా తొలగిపోయినప్పుడు, నేను తొలగిపోవడానికి సంతోషించనూ ?

మిమ్మల్ని నేను నిందించటంలేదండీ. మీ సుఖజీవితంలోకి నా కష్టాలను ప్రవేశపెట్టటం నాకిష్టంలేదు. ఇకముందెప్పుడైనా మిమ్మల్ని బాధపెడతానని భయపడకండి. ఈ వొక్కసారైనా, నా వొక్కగాని వొక్క బిడ్డ

చనిపోయిన యీ ఘోరసమయంలోనైనా హృదయద్వారా మీ యెదుట యేడవా లనే వాంఛను తీర్చుకోనివ్వండి. ఈ వొక్కసారే మీతో చెప్పాలనుంటాను. ఆ తరవాత అంధకారంలోకి వెళ్ళిపోయి, వెనకటిలాగే మూగదాన్నై పోతాను. నేను బ్రతికున్నంత కాలం నా రోదనం మీకు వినిపించదు. నేను చనిపోయిన తరవాత- మిమ్మల్ని యింకెవ్వరూ ప్రేమించనంత గాఢంగా ప్రేమించి, మీరు గుర్తించకపోయినా, మీ పిలుపుకోసం జీవితాంతం నిరీక్షించి, చివ రికి తీరనికోరికతోనే చనిపోయినవ్యక్తివల్ల మీరు పొందే ఆస్తి యిదే. బహుశా.... బహుశా.... దీన్ని అందుకొన్న తరవాత నాకోసం కబురు పంపు తారేమో, అయితే, అప్పుడు మొట్టమొదటిసారిగా మీకు ద్రోహంచేస్తాను— ఎంచేతనంటే, మృత్యునిద్రలో మీ పిలుపు వినలేను కదా. నా చిత్రాన్నిగాని, మరే చిహ్నాన్నీ మీకోసం వొదిలివెళ్లను. మీరు నాకోసం యేమిటి వొదిలి పెట్టారు ? మీరు నన్నేనాడూ గుర్తించనేలేదు. నా జీవితంలో నా విధి అలా వున్నది. మరణంలో కూడా నా విధి అలాగే వుంది. నా ఆఖరుఘడియల్లో మీకోసం కబురుపెట్టను. నా పేరుగాని, రూపురేఖలుగాని మీకు తెలియ జేయకుండానే నా దారిని నేను పోతాను. దూరంగా వుండి మీరు బాధపడ టం లేదు కాబట్టి నాకు మరణించటం సులభసాధ్యమవుతుంది. నా మరణం మీకు బాధకలిగించే పక్షంలో నేనెలా మరణించగలను ?

నేనింకేమీ వ్రాయలేను. నా తల బరువెక్కిపోతోంది. చేతులూ కాళ్ళూ సలుపుతున్నాయి. జ్వరంవచ్చినట్లుగావుంది. బహుశః త్వరలోనే అంతా అయిపోవచ్చు. బహుశా యీ వొక్కసారి విధి నా కనుకూలంగా వుంటుందనుకుంటాను. నా కొడుకుని వాళ్ళొచ్చి తీసుకుపోతుంటే చూడ నక్కర్లేకుండానే... నేనింకేమీ వ్రాయలేను.... సెలవు... యింక సెలవు తీసుకుంటాను.... మీకు నా ధన్యవాదాలు.... ఏదెలావున్నా అంతా బాగానే జరిగిపోయింది....నా అంతిమక్షణాల్లోకూడా మీకు కృతజ్ఞురాలినై ఉంటాను. మీకు అంతా చెప్పగలిగినందుకు సంతోషంగాఉంది.... యిప్పటికైనా, మీరు నన్ను పరిపూర్ణంగా అర్థంచేసుకోలేక పోయినా, నేను మిమ్మల్నియెంత ప్రేమించానో మీరు తెలుసుకోగలుగుతారు. నా ప్రేమ . మీ కెప్పుడూభారం కాదు. మిమ్మల్ని ఏ విధంగానూ ఆటంక పరచలేదనే నా తృప్తి. ఇక

ముందుకూడా దివ్యమైన మీ సుఖజీవితంలో యే విధమైన మార్పురాదు. నా మరణం మీకు హాని కలిగించదు. అదే నా సంతృప్తి.

కాని, యింకెవరు. అయ్యో, యింకెవరు పంపిస్తారు మీకు మీ పుట్టిన రోజు నాడు ఆ తెల్లగులాబీ పువ్వుల్ని ? ఆ గాజుకూజా ఖాళీగానేవుండి పోతుంది. ఇక నా జీవిత పరిమళం యేడాది కొకసారైనా మీ వసతి లో ప్రసరించదు. నా దొక్కటే మనవి — తుది, మొదలు అదే. నా కోసం చెయ్యండి....మీ ప్రతి "పుట్టినరోజు"నాడూ—ఎవరిగురించివారే ఆలోచించు కునే రోజున — కాసిని గులాబీ పువ్వుల్ని తెచ్చి ఆ గాజుకూజాలో పెట్టండి- ఏడాదికొక్కసారి మరణించిన బంధువుల జ్ఞాపకార్థం ఆబ్దికం జరిపినట్లు, చేయండి. నాకు దేవుడిలో నమ్మకం యేనాడోపోయింది. అంచేత నా ఆబ్దికం జరపమని అనటంలేదు. నాకు మీ యందే విశ్వాసం. మిమ్మల్ని తప్ప మరొకర్ని ప్రేమించను. ఏడాదికొకసారి మాత్రం మీలో మౌనంగా, హాయిగా-యింతకుముందు మీసమీపంలో నిత్యం జీవించినట్లు- జీవించాలనే నా కాంక్ష... ఆ పనిమాత్రం చెయ్యండి.... దయచేసి చెయ్యండి.... నా మొదటికోరిక, తుదికోరిక అదే....సెలవు, సెలవు.... ప్రేమతో... ప్రేమతో.... సెలవు...

కొయ్యబారి పోయిన అతని చేతుల్లోంచి ఆలేఖజారి క్రిందపడిపోయింది. దీర్ఘంగా, తీవ్రంగా ఆలోచించాడు. అవును, ఆ యెదుటింటివాళ్ల పిల్ల, ఆ అమ్మాయి, హోటల్లో కనిపించిన ఆ యువతి — అంతా మసకగా, అయో మయంగా, వడిగా ప్రవహిస్తున్న సెలయేరులో కొట్టుకుపోయే వస్తువులా మిణుకు మిణుకు మంటూ విస్పష్టంగా ఉంది. వివిధచ్ఛాయలు అతని మనస్సులో ఒకదాన్ని మరొకటి తరుముకొస్తున్నాయి- కాని అవన్నీ ఐక్యమై స్పష్టమైన చిత్రం కావటంలేదు. అవన్నీ మనస్సులో మేల్కొన్న అనేక జ్ఞాపకాలు- కానీ జ్ఞాపకంరావటంలేదు. ఈ బొమ్మలన్నిటి గురించీ తను కలగన్నట్టుగా వుందతనికి... తరుచుగా స్పష్టంగా వచ్చే కలలు— అన్నీ

కలలో ఊహాచిత్రాలే. అతని కన్నులు ఆ గదిలోవున్న తన వ్రాతబల్లమీది గాజుకూజావైపుకి తిరిగాయి. అది ఖాళీగానేవుంది. కొన్నేళ్లపాటు తన పుట్టినరోజునాడు అది ఖాళీగాలేదు. అతను జలదరించాడు. యేదో అదృశ్య కవాటం హఠాత్తుగా తెరుచుకున్నట్లు, పరలోకంనుంచివచ్చిన శీతలవాయువొకటి ఆ కవాటంగుండా తన సురక్షితమైన గదిలోకి వీచినట్లూ, తోచిందతనికి. మృత్యుసందేశము, అమర ప్రేమ సందేశమూ అతనికి చేరాయి. అగోచరమూ, ఆకర్షణీయమూ అయిన యేదో సుదూర సంగీతరవంలా ఆ మృతస్త్రీ భావన అతని మనస్సును కలచివేసింది.

